సీ. పువ్వుఁబోణికిమల్లె-పువ్వులుదంతము,
జవ్వనినాసిక-నువ్వుఁబువ్వు।
తావిసంపెఁగపువ్వు-తనువుదిరిసెపువ్వు,
మానినీమధ్యంబు-మజ్జిపువ్వు।
పల్లవాధరనవ్వు-తెల్లనిపువ్వులు,
పాలుపారుపొక్కిలి-పొన్నపువ్వు।
మోముతామరపువ్వు-మోవిమంకెనపువ్వు,
కన్నులునల్లని-కల్వపువ్వు।
గీ. కేలనీపువ్వులిఁకవని-హేలనొక్కఁ।
కాంతకరవీరమందార-కర్ణికార।
మాలతీచారుజాతీసు-మావళులనొ।
సంగెసీతకుఁగడుసొంపె-సంగుచుండ॥ ౩౯౯॥
వ. ఇవ్విధంబున నూర్మిళామాండవీశ్రుతకీర్తులకు ననుపమశృంగారంబు లొనరించియున్నంతనక్కడ. ౪౦౦॥
ఉ. అంగనలంగజన్ముఁడని-యంగవిలాసముసన్నుతింపఁగా।
న్యాంగనలొప్పఁబాడుచుఁబ్రి-యంబునరామునభంగమంగళా।
భ్యంగనమాచరించిహృద-యంగమవాక్యలలంకరించియు।
ష్యాంగుచుభూరికాంచనవి-భూషణముల్ప్రతితోషణంబునన్॥
గీ. తనరుకస్తూరిబొట్టులాం-ఛనముగాఁగ।
మందహాసంబుచంద్రికా-మహిమమెపర।
సరసవాక్యములమృతర-సంబుగాఁగ।
జంద్రుకైవడిశ్రీరాము-చంద్రుఁడొప్పె॥ ౪౦౨॥
క. లలిఁగంతుజయంతవసం।
తలలితులనవొప్పలక్ష్మ-ణభరతశత్రు।
ఘ్నులశత్రుఘ్నుఁగామిను।
లలంకరించిరివిభూష-ణాంబరపటలిన్॥ ౪౦౩॥

వ తదనంతరంబున. ౪౦౪॥

క. వయులన్న వితయులంబరి।
ణయయోగ్యలఁబ ద్మపుత్ర-వయవలనసమా।
వయితో ధన్యుల వాత్మతి।
వయులంగ నిజనకుఁడతిఘ-నంబగు వేడ్కన్॥ ౪౦౫॥

చ. చెలఁగిముహూ ర్తనిశ్చయముఁ-జేసివిదేహమహీధవుండమా।
త్యులఁబిలిపించియుద్ధశ ర-ధున్సుతబంధుసమేతుఁబంకజా।
ప్తలలితవంశ్యుఁదోడ్కొని ము-దమ్మునరండనవారలమ్మహా।
జ్వలుకడకేగియిట్లనిర-వార్యులువాక్చతురత్వమేర్పడన్ ॥ ౪౦౬॥

మ. అవనీనాథభవత్తనూజులకుఁగ-ల్యాణంబులన్నేయనీ।
దివసంబుత్తమమంచుఁదెల్పుఁడనివై-దేహుండుమమ్మంపినాఁ।
డవనీదేవసమావృతుండవయిర-మ్మాలస్యమింకేలబాం।
ధవులెల్లంగొనియాడఁబుత్త్రిహితభృ-త్యశ్రేణితోనొప్పగన్॥

గీ. అనినముదమందియొసఁగెన-య్యంబరమణి।
వంశమణివారలకునన-వద్యమణులు।
నమితతాంబూలజాంబూన-దాంబరాది।
మహితబహుమానములబహు-మానముగను॥ ౪౦౮॥

వ ఇట్లొసంగి. ౪౦౯॥

చ. దశరథుఁడంతబ్రాహ్మణవి-తానసమార్చనమాచరించిస।
త్వశరథులైనమానులుమ-దంబునఁగ్రోలరుదేరశత్రుఁడు।
ర్వశరథసామజాశ్వభట-వర్గసమేతముగానరేవ్వరు।
ల్వశులయిగొల్వఁబౌరజన-వారముసంతసమందిచూడఁగన్॥

క. రాజముఖులసేసలునీ।
రాజనములుఁగొనుచునుచిత-రాజపథమునన్।
రాజవిభవముననఖిలధ।
రాజనులునుతింపబంధు-రాజసహితుఁడై॥ ౪౧౧॥

వ. చనానవసరమ్మున॥ ౪౧౨॥

చ. తెలియవు కామినీజనుల - తేటలు పాటలు వేణువాదము।
తెలియవు చల్లుసేసలను - దేవతలొసఁగుఁ బుష్పవర్షము।
తెలియవు పంకజాప్తకర - దీధితులు న్మణిదీపశోభలుం।
గలసి మెలంగుటం ధరణి - కాంతుఁడు పెండ్లికిఁ దగ్గుమండగన్ ॥౪౧౩

క. అమరధునీవిమలాంభః।
కమలవనీవిహరణంబు - గాంచి మలయభూ।
ధ్రముగుహ...కోరమస్వ।
శ్రమజనితనిదాఘబిందు - సంచయము దుపన్॥ ౪౧౪।

వ. దశస్యందనుండు పురందరు చందంబునం బురంబు వారబ్బురం
బంద వలదశులం బుష్పవృష్టులం బురస్కరించికొని యమంద
మహానందకందకందళితహృదయారవిందుఁడై మందమందగమనం
బున వందిమాగధులు సందడింప జిందంబుల రోదలు గ్రందుకొనం
దరణికిరణంబులకుం దెలుపియూని గొడుగులం దనివినొందుచుం
దన కెలంకుల నందఱు మంత్రులుం దగురీతి నడువం దఱుమగ
సుందరమకరందబిందువులు జిందు మందారసుమసందోహంబులు
బృంగారకబృందంబు లందందగురియింప ధరణీబృందారకులా
శీర్వదించుచుం గొంచెఱు సుందరులు గ్రంతలుగొని ముందఱ నడువ
వందిమ్ములగు పందెయులడుగుం దమ్ములం దొడిగి చందనంబులంది యుం
దిందిరంబులం దెగడి సంక్రందన నీలంబులం గ్రిందుపఱచు కురు
లుం, దోవలం దరస్ఫురించు కందోవలదొంతికలుం, గందుకంబు
లం దిప్పు కుచద్వంద్వంబులుం, గుందవంబు డంబు డిందుపఱుపం
దగు తనుచ్ఛాయలుం, దలిరాకుమోవులుం, దలిచెక్కులుం, దర
స్మితంబులుం, గుందరదనంబులుం గలిగి యువజనంబుల డెందం
బులు గొందలంబందఁ జేయుచుం దన మోసలం దంపిలాసకాద
వివిధపిధానంబులం దాండవంబుసల్పుచు నెందఱేని నడువుం ద

అవలయగం జందనోదకంబునం బడిసి గండవడినందంబగు రాజమం
దిరంబు నవలీయంబోల్చు నవసరమ్మున సహాల్యానందమండగు శతా
నందనభుండు శతానందుండుతోడ రా జనకుండెదుర్కొని తో
డ్కొనిచని॥ ౪౧౫॥

క. సముచితముగ నర్ఘ్యము పా
ద్యము నొసఁగి యనంతరము ముదంబున మణిపీ
ఠములిడి జనకుఁడు పూజిం
చె మహారథుఁ దశరథుం బ్రసిద్ధుల మునులన్॥ ౪౧౬॥

వ. ఇట్లు పూజించి సమస్తజన మునిజన కదంబానంద జనకంబు లగు
వచనంబుల దశరథున కిట్లనియె- ౪౧౭॥

చ. బుధజనమాన్య పఙ్క్తిరథ-భూనుత కీర్తికి రామమూర్తికిన్
స్వధిత విరోధలక్ష్మణకు-మారునకున్ భరతాభిధానమా
గధత నయామితమాన్యులకు-గావలయున్ ద్వరలో వివాహముల్
ల్వప్రతిశుభ స్వశీభూతమును-పెద్దలవాక్యములాలకింపవే॥ ౪౧౮॥

వ. అనుటయు మహానందమగ్నుండగు దశరథుండు. ౪౧౯॥

క. తదవసరంబున మునులకు
సదమలులకు నెలవు పురకుఁబ్రశస్తంబగున
భ్యుదయాధారమధప్రుఁడొసఁగె
న్నోదల నిశ్రేష్ఠులకుఁ బాఁడి-మొదవుల ఁబోదలన్॥ ౪౨౦॥

క. విశిపంతంబుగ జనకుఁడు
మిథిలానాయకుఁడు విప్ర-మిత్రసహితుఁడై
మధుపర్కంబులు నేసెను
మధుపసమానాలకులకు మనువంశ్యులకున్॥ ౪౨౧॥

వ. తదనంతరంబున. ౪౨౨॥

క. కలధౌతభాతిసుందర
కలశోదకమాత్తపర్ణ-గర్భోన్నయుసఁగ।

స్తాలకులిశజలజరేఖా।
కలితనృపకుమారపదయుగ-ములుఁగనుఁగొనుచున్॥ ౪౨౩॥

కం. అన్యాయములకు దాస్యములు!
కన్యాదానసదృశములు-గావనియొసఁగెం।
గన్యాదానంబులనుమా।
ధన్యులకు నెన్నదశరథ-రాజసుతులకున్॥ ౪౨౪॥

వ. అంత॥ ౪౨౫॥

చ. చెలఁగియరుంధతీపతివ-సిష్ఠుఁడు రాముకరంబుఁ బూనిని।
ర్మలనవరత్నగుంభనవి-రాజితదివ్యవివాహవేదికా।
జ్జ్వలకనకాసనంబునని-వ్ణునిజేసి సువాసినీజన।
మ్ములనియమించెనింతవయ-భూతనయందగఁదోడి తేరఁగన్॥

కం. నీరపథజాతకుంబ్రశి।
నీరముఱుఁగుపెట్టిస్ఫుటకు-కేశయముఖులా।
శ్రీదుర్యక్షులు నెలఁగనునా।
శ్రీరవిభుఁడు రామచంద్రు-చెంతనునిచిసన్॥ ౪౨౬॥

కం. ఒకరినొకరుచూచెడువే।
డుకలుకడున్నొలకలెత్తు-డువధూవరవ్రా।
క్రవ్వకరముగదిరివదగెయవ।
విశయమునావిమలవాహి-నీభంగమునన్॥ ౪౨౭॥

వ. అంత॥ ౪౨౮॥

తే. తెలువలుదితరీతిఁ-దెరవలువమరల్ప।
జనకభాగ్యరాశి-జనకతనయ।
కలుఁగుతెవిచారి-తరగలనుదయించు।
నిదివిధమునఁదేజ-నిరవహించె॥ ౪౩౦॥

గీ. లలితమాలామనోహర-గళయగుచుఁడ।
మాలసాలంబుసరసనే-తాలతయన।

క. దానోత్తమమగుభోజన।
దానంబుశజనులఁదనిపెఁ-దజ్జనకుండుం।
దానంబులనురుభక్తిని।
ధానంబులద్విజులఁదనిపెఁ-దజ్జనకుండుఁ॥ ౨౨౫॥

వ. అంత. ౨౨౬॥

గీ. గంధసింధురజవనకం-ఖాణసుభట।
రత్నధేనుసువర్ణవ-స్త్రప్రశస్త।
దాసదాసీవిశేషశ-య్యాసనంబు।
లరణములొసంగె వేత్స్రీఱ-నల్లురకును॥ ౨౨౭॥

క. విశ్వానందప్రదస!
ప్రాశ్వకులులయాచితపరిణ-యంబులుగనియా।
ర్వీశ్వరుదీవింపుచున।
విశ్వామిత్రుండభీష్ట-వృత్తింజనుఁడుఁ॥ ౨౨౮॥

ఉ. కూఁతులఁజేరఁబిల్చిజన-కుండుమహాదరణంబుమీఱవి।
ఖ్యాతపతివ్రతాత్వవిధి-తాంచితశీలములెల్లవారికిం।
ప్రీతినుపన్యసించియల-రించివిశేషవిభూషణాంబర।
వ్రాతసువర్ణరత్నవిక-రంబులొసంగమనోముదంబుగన్॥ ౨౨౯॥

క. హరియునుసిరియునుమానవ।
శరీరములుదాల్చినట్టి-చందమువవధూ।
వరులీసీతారాములు।
గరమొప్పిరటంచుజనుల-కలకలమెసఁగెన్॥ ౨౩౦॥

క. అధికతరానందుఁడుదశ।
రథధరణీవిభుఁడుతత్పు-రంబునమహిత।
ప్రథఁగొన్నిదినంబులుజన।
ధరాధిపమాన్యుఁడైత-గన్వసియించెన్॥ ౨౩౧॥

వ. ఇట్లుండి యొక్క శుభదినంబున జనకునను మతింబువడసి యపరిమి
తపరిచారికావృతలగు వధూరత్నంబులును మహానందయుతులగు
సుతులును సమస్తబంధుమిత్రామాత్యులును సముచితవాహనం
బులధిష్ఠించి యనుగమింపరథారూఢుండై పుణ్యకామినీ జనమ్ము
లు సేసలు చల్లవల్లనమ్మిథిలాపురంబు వెలువడి తన్నునుపవచ్చు జన
కచక్రవర్తి నధికధర్మమూర్తి సపరివారంబుగా నెట్టకేలకునివర్తిం
చియుచితయానంబున సాకేతాభిముఖుండై॥ ౪౫౨॥

క. దారితక్షాత్రవసంచయుఁడు।
దారుఁడుపజ్ఝ్యారఘుఁడేను-దారిభయదము।
ఘోరతములుమారుతములు।
దారుణముగవీచెనత్యు-దగ్రస్ఫురణన్॥ ౪౫౩॥

గీ. ఇట్టిదుశ్శకునంబుల-నెట్టిరట్టు।
పుట్టునోయనికులగురు-వునకుదెల్పి।
తద్విధంబెల్లనాత్మబో-ధమునఁదెలిసి।
యాతఁడాతనికిట్లను-నంతలోన॥ ౪౫౪॥

సీ. క్షత్రియారణ్యాగ్ని-హోత్రమహోజ్జ్వల,
తీక్ష్ణలకుఠారంబు-కేలఁగ్రాలఁ।
గాంచనాచలకట-కవిశాలవక్షస,
లంబునఁదెలిజన్ని-దంబుమెఱయ।
నఖిలమానవనివ-హభయంకరములైన,
దృష్టులనంగార-వృష్టులొలుక।
నధికప్రతిఘదెల్పు-నరుణకాంతివహించు,
ముఖమునఁగనుబొమ-ముడివడంగ।

గీ. దశరథుండిచ్చుపూజావి-ధానములఁబ।
రిగ్రహింపకయాగ్రహో-దగ్రుఁడగుచు।

చెలఁగి సాకేతమున కువి-చ్చేయుటయును।
జెప్పి రవ్వి విచాల సంతసిం-చిరి మఱియును॥ ౪౭౭

భ. పురవరవర్ణినుల్వివిధ-భూషణభూషితలై సువర్ణనూ।
పురరవముల్ సెలంగఁగను-బొంగెడు రాగరసంబు చేర్తగో।
పురవర సౌధభాగములఁ-బొందుగ నిల్చి నరేంద్రు రాముఁగో।
పురవరు పౌర కామినుల-పోలికఁ జూచిరి సేసలొల్కఁ జల్లుచున్॥ ౪౭౮

వ. తత్సమయంబున ౪౭౯

సీ. అగణిత సౌధయా-నిగమాంబురాశికి,
రాణించు చదనరాక - రాక గాఁగ।
సమధిక భయద రా-క్షసచమూపతులకు,
దనదర్శనము సుద-ర్శనము గాఁగ।
వీతవిద్వేషులౌ విబుధ నాయకులకుఁ,
దచ్చరిత్రములు చి-త్రములు గాఁగ।
సహిత రాజన్యసై-న్యములకుఁ దన ప్రతా,
పంబు మిక్కుటపుఁ దా-పంబు గాఁగ।

గీ. సత్యధర్మక్షమాదయా-శౌచదక్షి।
సమితిఁ దన గుణములు గు-ణములు గాఁగ।
దమ్ములనుఁ గూడి రామచం-ద్రప్రభుండు।
వేడ్క విహరించె నప్పుర-వీధులందు॥ ౪౮౦

వ. ఇట్లఖిల జనానందోత్సవంబుగా విహరించి. ౪౮౧

క. తమ్ములు తరుణీయుతులు చి।
తమ్మునఁ దనుఁ గొలువఁ దాను-సీతాయుతుఁడై।
తమ్ముఁగను వేడ్క నధిపము।
దమ్మందు మనున్న యట్టి-తల్పుల కరఁగన్॥ ౪౮౨

వ. అంతఃపురమ్మునకుం జనునవసరమ్మున నావసరమ్ము లఱిమ్ములఁగి రమ్మ్య
మెఱయఁగ రమ్ముల గంకణనికరములు మొరయఁ గుచము లొరయఁ

జతనమ్ముగ రతనమ్ములు చెక్కిన పసిండిపళ్ళెరమ్ముల నమరుహారమ్ములం గు హిమవాలుకా దీపమ్ముల దీప్తులు దమతిలప్రదీప్తులకుం దగ వసిక్రిందుపఱచుట దగవవిన చందమ్మునం గొమ్మలు బాహాలతి కలుసాచి యొసంగు నీరాజనమ్ముల రాజిల్లుచు నెడనెడ వినోదమ్ములకు వీణానాదమ్ములకు ముదమ్ము నొందుచు జనయిత్రుల పంపున నెదుర్కొని పుణ్యకామిని జనమ్ములొసంగు రక్షాకరణమ్ములకు సమ్మతించుచు నుభయపార్శ్వమ్ములనుండి యుభ రాజగమనలు శుభాచారలాజమ్ములు చల్లుచు నాసేచనకమ్మగు నిజ మూర్తికా విలాసమ్ము నాలోకనమ్ముం గావింప మనోహరరత్నకుంభన విచిత్రభిత్తికాని కాయ్యంబులవలనను అసమానాసమానకాయమానంబులవలనను నిరుపమానమానినీబృందంబులవలనను రమణీయాంతరపదార్థంబులవలనను గరంబొప్పు మాతృగృహంబుం జేరియుంజని.

ఉ. తమ్ములం గూడి రాఘవుండు-తల్లుల పాదతలమ్ములా త్తమా|
రమ్ములు సోక మ్రొక్కెనము-దమ్మున దీవనలిచ్చి గుచ్చిపై|
మమ్ముం గౌంగిలించి కొని-మక్కువ లెక్కువ లైతినర్పనా|
యమ్ములు ముద్దులాడిరి ప్రి-యమ్మున నిద్దఱుం జెక్కుటద్దముల్ ॥ ౪౭౩॥

క. చన్నులం దుగంబులు వా|
లన్నులనానంద బాష్పకణములుం గురిసెం|
గన్నులపండువగుచుఁ దు|
లన్నులుపురంజా మతల్లులకుం జిత్రముగన్ ॥ ౪౭౪॥

వ. తదనంతరంబున ॥ ౪౭౫॥

సీ. అంబుజాంబుల పిండి-యాకుల విధమ్మున,
మోము వంచలకులు-ముసుగు వడగ|
నడుములున్న పని తె-ల్పెడుభంగిం గాంచికా,
కింకిణీక్వణనము-క్రీంగ నొనగ|
నీలవేణు తుమ్మల-పెలములాడువి,

దమ్మునఁ జికురబం-ధమ్ములమరఁ।
బవతలమ్ములకెంపు-లొదవిసుధాధౌత,
సోపానములమణి-చ్ఛాయలొందఁ।
గీ. జీవనగవులావనములకుఁ-జెన్నొసర్ప।
వినయములురూపములుదాల్చి-చనువుగాఁగ।
వల్లవల్లవజనుదెంచి-యత్తలకును॥
మోదమునఁ గ్రొత్తకోడండ్రు-మ్రొక్కుటయును॥ ౨౬౬॥

క. శ్రీవనితాచతురాకృతు।
లీవనితలటంచుఁ బ్రీతి-నెత్తికొనికడుం।
దీవింపుము నెంతయుసం।
భావించిరిమానసములు-ప్రమదంబందన్॥ ౨౬౭॥

క. శ్రీకరమూర్తులఁ బుత్త్రిల।
నాకోడండ్రఁగనియుబ్బి-యూడిరివిమలా।
స్తోకచరిత్రలుగాన।
ల్యాక్రైకాముగ ధతివయ-లానందమునన్॥ ౨౬౮॥

క. వనితాయుతులన్సుతులం।
గనిజననీజనకులమిత-కౌతుకమతులై।
రనిచెప్పితవమనంబున।
ననుపమమనుహార్షమంత-కంతకుఁబెరుగన్॥ ౨౬౯॥

చ. పరమకృపారసానిలయ-భావితమానిసుచిత్తసారసా।
నిరుపమసాహసావినుత-నీరజగర్భకృపీటరేతసా।
గురుతరదేహసారపరి-కుంఠితదుష్టనికృష్టరాక్షసా।
భరితమహాప్రసాదహిత-భక్తజనావనసక్తమానసా॥ ౨౭౦॥

క. శరణాగతజనశరణా।
శరనారదకీర్తిస్తనిత-సంకాశరణా।

స్ఫురణోక్తిమదాశరథా।
చతణా వేంకటమహీర-పాథరశరణా॥ ౪౮౧॥

మాలినీ. ప్రణమదఖిలమారీ-భక్తలోకోపకారీ।
ప్రణవఘనవిహారీ-భాసురానందకారీ।
రణవిజితసురారీ-బ్రధ్నచంద్రానుకారీ।
తృణకలుషవిదారీ-సర్వదానిర్వికారీ॥ ౪౮౨॥

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణభూమధైర్య వినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ కొత్తపల్లి లచ్చయప్రణీతంబైన దాశరథివిలాసంబను మహాప్రబంధంబు నందు ద్వితీయాశ్వాసము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# దాశరథివిలాసము

## తృతీయాశ్వాసము.

---




మద్వేంకటనామా।
ద్ధామధరాధామసుగుణ-ధామరవిసుధా।
ధామనయునవందితసు।
త్రామారిపుభీమనుంద-రవిజిత్కామా॥ ౧॥

వ. అవధరింపుమనంతరకథావిధానంబుఁ బ్రచేతసుండగు ప్రాచేతసుం డిట్లని చెప్పందొడంగె నట్లు సంప్రాప్తమనోరథుండగు దశరథుం డొక్కనాఁడు నిండుఁ గొలువుండి యమాత్యులం గలయం గనుంగొని. ౨॥

ఉ. సంతతిలేదులేదనువి-చారముదూరముఁగాఁగఁబుత్త్రిలన్।
సంతసమందఁగాంచితిన-సాధ్యబలాఢ్యులువారువారికి।
స్సంతతకీర్తిశాలురక-సంగఁగసన్నుతపుణ్యకామినీ।
సంతతులైనకన్నియలఁ-జక్కఁగఁబెండిలిచేసితీగతిన్।  ౩॥

క. నాకులముగడువెలింగె।
న్నాకులసత్కీర్తియయ్యె-నాకులమొప్పె।
న్నాకులకాంతలమతులున।
నాకులములుగాఁదనర్చె-నాకులకరుణన్॥  ౪॥

వ. అని పలికి వెండియు. ౫।

క. బుద్ధివికలమగుదృష్టియు।
విద్ధంబగుబలముచెడువి-వేకంబుడుగు।
వృద్ధతగదిరినజనునకు।
సిద్ధంబలఁ డెంతయుం బ్రసిద్ధుం డైనన్॥ ౬॥

ఉ. అర్థజనావనంబువివి-ధాహితసైన్యమహాతిశక్తితా।
నిర్ధారణంబునంచితమ-నీషయురోషవిశేషదోషని।
స్తర్హాణనంబు రాజులకు-సమ్మతధర్మము లౌటఁ జూడఁగా।
వర్ధులుగాని రాజ్యమున-కంధులువృద్ధులుబుద్ధిహీనులున్॥ ౭॥

వ. అనియిట్లు తనకృతార్థత్వంబును, వృద్ధత్వంబును, రాజ్యపాలనా సమర్థత్వంబును దేటపడంబలికి మఱియును. ౮॥

ఉ. నించెదఁ గీర్తిదిక్కులన-నిందితధాముని రామునిం బ్రతి।
ష్ఠించెదఁ బూజ్య రాజ్యమున-శిష్టజనానుమతుండ నైయను।
ష్ఠించెదసద్వ్రతంబులువి-శేషధృతిన్సుకరంబు గానధి।
ష్ఠించెద సంతసంబునెడు-దివ్యసువర్ణసువర్ణహర్మ్యముల్॥ ౯

వ. అనినవినియాద్దశరథునకుం దదీయ మంత్రిపుంగవులఖిల జనానుమతంబువడసి యిట్లనిరి- ౧౦॥

క. ధాతవువిద్యలకున్నాం।
ధాతవువిక్రమసమృద్ధి-దాతవుశుభసం।
ధాతవుజనములకివ్వసు।
ధాతలమేలితివితొంటి-ధరణిపులక్రియన్॥ ౧౧॥

వ. ఒక్కనాఁడు నీయందు గోరంతకొఱంతఁ గంటిమేయని పలికి మఱియును. ౧౨॥

ఉ. నీవుమహానుభావుఁడవు-నీతివివేకవిశారదుండవుం।
గావుననిట్టిసత్సుతులఁ-గాంచిసుఖింపఁగఁ గంటిమీరలుం।

దేవసేనానులగ్రజుఁడు - దీర్ఘభుజాబలుఁ డార్యలోకసం।
భావితుఁడీకుమారకుని - బట్టముఁ గట్టఁదలంపఁ బూటొప్పగున్ ॥ ౧౩॥

ఆ. పట్టభద్రుఁ గామ - భద్రుఁ గనుంగొని।
యుల్లసిల్లుదురుత - దుత్సవమున।
కఖిలజనులు నేము - నలరుదుమీవును।
జ్ఞానుఁడవగుదువట్లు - చెలుఁపుమనఘ॥ ౧౫॥

వ. అని తనమనంబునకనుకూలంబు గాఁ బల్కుటయు నమ్మహావిభుండు.

గీ. చెలఁగి శ్రీరాము పట్టాభి - షేకమునకు।
వలయు సంభారములు రెండు - వలను మెఱసి।
యేతదుత్సవమెఱిఁగింపుఁ - డెల్లవార।
లకునొనర్పుఁడుం బురమున - లంకృతముగ॥ ౧౬॥

వ. అని చెప్పి యంతఃపురంబునకుం జనుటయు నమాత్యులు. ౧౭॥

శా. రంభాస్తంభములెల్లచో నధికచి - త్రస్ఫూర్తిఁ గల్పించినా।
త్నాంభోజోత్పలమాలికల్నెఱపి వే - శ్యాలాస్యముల్మీఱఁ బ్రో।
జ్జృంభత్కాంచనభద్రకుంభతతిన - క్షీణస్థితిన్ గల్పిరం।
జంభారాతిపురావధీరణలస - త్సౌందర్యయుక్తంబుగన్ ॥ ౧౮॥

వ. మఱియుం బరమశోభనంబుఁ గావించి రప్పురవరంబు వినూతన నికేతనకేతనంబై, ప్రాతానీత పుణ్యనదీతోయాన్వితంబయి విశాల కమలకమలాకర కమనీయ కమలాకరంబై యనూనోద్యాన వనఘనోపవన పవన మనోభిరామంబై దేవమానవతీ సమానమానినీ మానితంబయి మధుర మాగధ గానంబులవలనను, మహోత్సవాలోకనాగత జనపరిస్వరాహ్వాన ధ్వానంబుల వలనను భేరీమృదంగాది మంగళస్వానంబులవలనను జృంభితమదకరి బృంహిత ధ్వానంబులవలనను బూర్ణిమాసుధాపూర్ణ భానూదయ సమయ ఘూర్ణమానార్ణవంబన నిర్ణయింపందగి యుంపుదలకొత్తుచుండె నంత నొక్కశుభదినంబున. ౧౯.

గీ. గురునియానతి రఘువంశ్య-గురుఁడు రాముఁ
డంద్రుఁడతి వేడ్క-జానకీ-సహితుఁడగుచు
నలఘుతరమంత్రపూతాంబు-వులను గడుఁ బ్రి
యంబున నుపాంగకస్నాన-మాచరించి॥ ౨౦॥

క. తానపుడు వోలిచెమానిని
ధానుఁడు గృతపుణ్యతరవి-ధానుఁడు శుభసం
ధానుఁడు ధౌతాంబరపరి
ధానుఁడు సౌమిత్రిసన్ని-ధానుఁడు మిగులన్॥ ౨౧॥

వ. అయ్యవసరంబున మంధరయను దాది తనదొరసానియగు కైకకడ కుంజని ససంభ్రమంబుగా నిట్లనియె. ౨౨॥

క. మతిఁ గార్యగతి నెఱుంగక
యతివా పతి నాఁకూర్చ్యున్నను చుమిగులన్
స్మితిపతి మతిహీనవు పసు
మతి సవతిసుతుండ యేలు-మహిమోజ్జ్వలుఁడై॥ ౨౩॥

వ. అనిపల్కి వెండియు॥ ౨౪॥

మ. పతి కౌసల్యకుఁ గూర్చి తత్సుతునకుం-బట్టంబు గట్టంగ ను
ద్యతుఁడై యుండుట తెల్లమయ్యె ను సప-త్న్యైశ్వర్యోద్భవుం డుర్వరా
పతి గాఁ జూచెడువంత పెద్దభరతుం-బట్టానకుం బాపి దు
స్థితి నొందించినఁ గుందు పుత్త్రిఁగ మన-త్త్రీవ్రాత్త్రికంబెంజెరీ॥ ౨౫॥

చ. వరములు తొల్లి నీకుఁ జన-వల్లభుఁ డిచ్చెను రెండు వానిలో
భరతునిఁ బూజ్య రాజ్యపద-బంధురుఁ జేయుట యొందు గాన నో
ర్వరఁ బదునాలుగేండ్లు జిన-వల్కలముల్ ధరియించి జానకీ
శ్వరుఁడు చరించుటొండి విధ్ర-వంబుగ నొందు దొలంగి వేఁడుమీ॥

చ. అనవిని కైకచిత్తము రి-యాడఁగ నిట్లను మంధరాధరా
వనము నకగ్ర పుత్త్రికున-వశ్యముఁ బూన్పక మాననేర్చునే.

# తృతీయాశ్వాసము.

---

మనుజవరుఁడు నీవనుక్ర-మంబున వేఁడుట నాకధర్మమై।
నను బలిఁ జేరి యివ్విధము-నన్నొగమోడక మూదలించెదన్॥ ౨౭॥

వ. అనిపల్కి దైవప్రేరితయగుటం జేసి ధర్మణంబుదలంపక. ౨౮.

సీ. ధవుఁ జేరి మేదినీ ధవభవద్రగభ',
రాత్యసుతు శ్రీరాము-నడవిలోఁజ।
తుర్దశాబ్దంబులు-దుర్దశనొందంగఁ,
బంపి నా పుత్త్రికు-భరతు నిఖిల।
రాజ్యంబునకునిప్డు రమణుని గావింపు,
మీవు రెండువరంబు-లిచ్చినాఁడ।
వెలుఁగుము తొల్లి నీ-విటుఁజల్పితగుకీర్తి,
వడసి కృతప్రతి-జ్ఞుఁడవు గమ్ము।

ఆ. భానుకులులు రాజ్య-హీనంబునకు నైనఁ।
దరము గాని యాప-దలకు నైనఁ।
ప్రాణభయదమైన-ప్రధనంబునకు నైన।
వెలపరవ్రతమునకు-వెరచినట్లు॥ ౨౯॥

వ. అని యడుగుటయు నప్పలుకులు ములుకులక్రియ నాటుకొనవెల్టుట
యుఁ మలికిపడి యమ్మహీవిభుండు. ౩౦.

క. కైక వినుము రామునిలో।
కైక వినుత నాము నడవి-కనుపుమనుమనీ।
కైక డఁగి రెయొరుల నెడనుడిఁ।
గైకొనఁ గాఁదగు నెకూరిర-కర్మము గాదే। ౩౧॥

మ. ధనము ల్వేఁడిన వేఁడఁగాఁదగు సుతున్-ధాత్రీతలం బేలఁగా।
రిన నోరందగు నీవు నీకు సవతుల్-ప్రీతిన్ బనుల్సేయఁ జూ।
చినఁ జూడందగుఁ గాక వారిజముఖీ-చిత్తంబు భగ్నంబుగా।
మునివృత్తిన్వనవాసిఁగాఁగ రఘురా-మున్వేఁడ నీకర్హమే ౩౨॥

గారముఁ జేరియుందొరఁ-గారతనంబులుగూర్చియున్నబం
గారపుగద్దెపైఁదనవు-గాఁజియపెట్టఁగవందుభూపతిన్॥ ౪౦॥
క. కనుఁగొనిమతిఁదకగనుఁ
గొనిజనయిత్రియుదేమి-ఘోరపుశోకం
బునభూపతిమునిఁగినవాఁ
డనియడిగినఁగైకనిర్దయామతియగుచున్॥ ౪౧॥
క. మనచునవినిం చుకయేనియు
ననుమానముమానిపలికె-నవికారుఁడవై
విను తనయా వినుత నయా
వినిచెదనేతద్వృథమున-విస్తరఫణితిన్॥ ౪౨॥
ఆ. నాకుఁదొల్లిమీజ-నకుఁడిచ్చినవిరెండు
వరములంబుభూమి-భరముభరతుఁ
బూన్పుటొకటినీవు-పూనిచతుర్దశా
బ్దంబులడవిఁదిరిగి-వచ్చుటొకటి॥ ౪౩॥
క. సమయంబగుడువరద్వితి
యము వేడినతఁడుగపటి-యైయిఁకిరియమా
సముఁబూనియున్నవాఁడని
చమత్కృతియొసంగఁజెప్పి-చయ్యనమతియున్॥ ౪౪॥
క. శ్రీదొరఁగిరొకటవవముల
లోఁదిరుగుటనీకుఁదొలిగ-లుగుటన్నినుబు
త్రాదివిజాలుపొగడఁగఁబి
తాదేశము సేయవలయు-నవికారుఁడవై॥ ౪౫॥
చ. అనవుడుఁగైకఁజూచిపర-మాదరణంబునరామచంద్రుఁడి
ట్లనుజనయిత్రినాకుజన-కాజ్ఞయొనర్చుటమేలునాదుత
మ్మునివసుధాభరంబునకు-ముఖ్యునిఁజేయుటయంతకంటెమే
లనయముఁగానవాంతరవి-హారముమూఁడవమేలుచూడఁగన్॥ ౪౬

---

వ. అనిజనకు డెసంగనుంగొని- ౪౮॥

చ. ఇతఁడు ప్రతిజ్ఞ దప్పి నమ-హీతలమెల్ల వదలిక దేసరి।
తృతిజలమింక దేగ తవి-భాసితిఁ బ్రాగ్దిశఁ బొద్దు గ్రుంకదే।
మతిన నమానమించుకయు-మానిచతుర్దశవత్సరములవ్వన।
క్షితివిహరించి మించి కృత-కృత్యుఁడనయ్యెదఁ బోయివచ్చెదన్॥

వ. అనియంత నిలువక-  ౪౯॥

చ. జనకునిసత్యవాక్యము ప్ర-సన్నతమయ్యెడునంచు రత్నభూ।
షణవసనప్రసూనాదికవి-సర్జితుఁడై యుచిలోత్తరీయము।
ల్బనుపడఁ జేసియంగమున-భస్మముఁ బూసిజటావిభాసియై।
ఘనవనవాసివేషము వి-కారము లేపిననూనసంబుతోన్॥ ౫౦॥

ఆ. తాల్చి కైకఁ బిల్చి-తల్లియే బ్రహ్మచ।
ర్య వ్రతంబు మెయి వ-రణ్యభూమి।
సముయసమములొ ప్పఁ-జరియించి వచ్చెద।
ననుచుఁ బలికి వెసఁద-దాజ్ఞ వడసి॥ ౫౧॥

క. అంతక మునువంతన్వన।
కాంతఃకరణుఁడగు జనకు-నంతికమునకు।
స్వాంతసమునఁ జనియమ్మహి।
కాంతునిపీఠికొని మ్రొక్కె-కదలెడు నెడలన్॥ ౫౨॥

క. రాముని మునివేషముఁ గని।
సౌమిత్రివిశేషరుటక్రూ-పాయితముఖుఁడై।
భూమీశుడెసకునదర।
ప్రామముఁ డువారించియనుజా-వకు నిట్లనిరొన్॥ ౫౩॥

చ. ఎటు తెగితయ్యలక్ష్మణయ-హీనుఁడనయ్యెవిపోక్తులాడఁగా।
నిటుఁదగు శోకదాయును మ-నెంతయు శాంతునిఁ జేసితమ్ముఁడా।
యటవిఁ బితృప్రాపదిష్టసమ-యాబ్దములం ద్రుటికాలమట్లనె।
క్షితివిహరించి వచ్చెదన-కంపితనావ్రుఁగంపితాత్ముఁడై॥ ౫౪॥

క. అన్నా నాయనుగమనం
బున్నీ వొడఁబడక రాకు-పొమ్మన్న వినం
బున్న మలివిడుతుఁ బ్రాణము
లన్న నతఁడు హృదయమాద-రార్ద్రంబగుడున్ ॥ ౫౫॥

గీ. రామచంద్రుఁడు సౌమిత్రి-రాక కట్టి
కేలకొడఁబడియాతని-కేలు గేలఁ
గీలుకొల్పి భయంబునీ-కేలనిన్నుఁ
బాసి చరియింప నేర్తునే-భరితవినయ ॥ ౫౬॥

వ. అనియూఱడిల్లం బలికిన నతండు సంతసిల్లె నయ్యవసరంబునఁ దద్వృత్తాంతంబంతయు వినుటం జేసి. ౫౭॥

చ. నడుము సియాడ వేనలిఘు-నంబయి వీపునఁదూలియాడ మో
ముదుపతి మేలమాడ నధ-రోష్ఠము బింబముఁబంతమాడ మె
చ్చొదుగతిఁగర్ణికారుచివి-శేషము చెక్కులఁ జిందులాడఁ బే
రడఁకువ వచ్చెఁజిత్తమురి-యాడఁగ నీకమహీజ చెచ్చెరన్ ॥ ౫౮॥

వ. ఇట్లువచ్చిన ప్రేయసిం గటాక్షించి. ౫౯॥

క. పితృనానతి సెల్లింపఁగ
నతివా వినుపదియు నాల్గు-నబ్దాబులుస
మ్మతివన వాసముదగ స
ల్పితిరిగి చేతెంచెదవిల-పింపకుమబలా ॥ ౬౦॥

చ. అనుటయు సీత నీకుఁ బితృ-నానతి సేఁతయు నాకు భర్తృపా
దనలిన సేవయుం బరమ-ధర్మములిట్లన రాదు నీవు నా
యనుగమనంబొడంబడని-యప్పుడ మృత్యువునొందిదైయైననీ
యనుగమనంబుఁ దప్పవిపు-లాదికభూతగణంబు సాక్షిగన్ ॥ ౬౧॥

క. నాయనుగతిఁ గొడఁబడుము వి
ధేయను గోపంబుఁదక్క-తెలియుము వినుతను

చ్ఛాయను బోలిన జాయను।
బాయు మధర్మంబె నీకుఁ - బరమవివేకా॥ ౬౨॥

క. అని వెచ్చనూర్చి మించుప।
డిన సెంతయుఁ దేజమేది - డిందువడిన ప।
ద్మనిభంబగు మోమును వా।
డిన మోవియుఁ గల్గి తల్లడించుచు నుండెన్॥ ౬౩॥

క. మగని కెడ మేలుఁగు మగువకు।
నగపడ విల సెంత లేసి - యాపద గైనన్।
మగనిం బాసిన మగువకుఁ।
దగు సౌఖ్యము లెన్నియున్న - ధాగతి నుండున్॥ ౬౪॥

వ. ఇవ్విధంబున. ౬౫॥

ఉ. కన్నుల శోకవేగమునఁ - గాలువగట్టెడు బాష్పధారలం।
జన్నుల కుంకుమం దడపు - జానకిఁ గన్గొని మానవేంద్రుఁడో।
యన్నులమిన్న నిన్ను విడ - నాడఁగ నాడుట కాదు కాననా।
పన్నత నొందఁ జాలవని - పల్కితి నింతులు వంత కోర్తురే॥ ౬౬॥

క. అని కలికి సీత రాకసు।
ననుకూలత దోఁపఁ బలికి - యరిగి సుమిత్రా।
తనయజనకతనయా యుతుఁ।
డనఘుఁడు శ్రీరాఘవుఁడు ని - జాంబవలనికిన్॥ ౬౭॥

ఉ. క్షత్రియమిత్రగోత్రుఁడు ప్ర - శస్తచరిత్రుఁడు రామమూర్తి సౌ।
మిత్రియు ధాత్రిపుత్త్రియును - మేకొని కాఁ జని కాంచె నత్త్యుర।
స్సూత్రికఁ బ్రాణవాయుకృత - శుద్ధయశోమగధావనీశసు।
త్పాత్త్రికఁ జేతనాత్తమణి - పుత్త్రికఁ గోసలరాజపుత్త్రికన్॥ ౬౮॥

వ. కనుంగొని నమస్కరించి ౬౯॥

చ. కరములు మోడ్చి తల్లి నిను - గైకకుఁ దొల్లి కరంబు నెయ్యఁడై।
వరములు రెండొసంగె జన - వల్లభుఁడా యమయిష్టు వేఁడెకా।

జ్వరమదొరంగియేనడవి-చక్రవర్తిలభూతధాత్రికిన్।
దొరయునఁగాఁబ్రభూతభర-తుంభరతున్నియమించునట్లుగన్॥ ౨౦

క. వేఁడినసమ్మాటలుచెవి।
చూఁడినయట్లయినస్పృహుఁడు సుడివడియెడునా।
ఱోఁడాడినమాటకునీ।
రేడేడులువనిఁదిరిగితి-రిగియోతెంతున్॥ ౨౧

క. అమ్మా నెమ్మదినించుక।
యమ్మలికముమాని ధైర్య-మూఁదుమనుఁడు వా।
లమ్ములగుచునవ్వాజిన్నచి।
యమ్ములునాటుటయువివశ-యైయిట్లనియెన్॥ ౨౨

ఉ. యోగ్యముగాఁగనీవుమహి-మోజ్జ్వలలీలఁగృతాభిషేకసా।
భాగ్యమునొందఁగాంచుటకు-భాగ్యముగల్గనటంచునున్నచో।
యోగ్యనుకూలవర్తనకు-నోర్చివిశేషసుఖంబులెల్లనై।
రాగ్యముపేర్మిపీడినగ-రంబిటువెళ్వడఁజూడఁగల్గనే॥ ౨౩

క. సమ్మతిఁదాపమ్ముడిపిక।
రమ్ములలాలించిసత్స-రణిమెలఁగినచో।
షమ్మెటుఁగఁడనుచునెమ్మది।
నమ్ముంగారాదురాజ-నామమువానిన్॥ ౨౪

వ. అని పలికి కరంబులు విదుర్చుచు నిట్టూర్పునిగిడించి కైకనుద్దేశించి.

కమలవిలసితవృత్తము.

అధిపతితనవుఁ-దనితగునేని।
న్నధికభయదమగు-నడవికిఁబంపఁ।
బ్రకితియశముఁజెఱు-పఁదలఁచెనేదు।
ర్వ్యధవిలపితమెటు-వృధయగుఁబుత్రా॥ ౨౫

సీ. ధర్మనాశముఁగూర్ఁర-కర్మంబటంచుఁగొం,
కకనెట్టువరములు-గాక వేఁడె।

నాలిమాటలకులో-నైనీవు గాకను(,
బోవంగనెట్లోర్చె-భూవిభుండు।
అడవికినిను బంపు-టన్యాయమనియొత్తి,
చెప్పంగ లేదవ-సిష్ఠమౌని।
సకలసౌఖ్యముల కా-స్పదమైన లక్ష్మివి,
వర్జింపనీకేల-సాహసంబు।

గీ. అనుచు వెచ్చనూర్చు-హాయనిపలవించు।
దైవమాయటంచు(-దల్లడించు(।
గరము(గోపగించు(-గౌసల్యపుత్త్రివి।
రోగశోకముఁవకు-నోర్వలేక॥ ౭౭

వ. మఱియుం బ్రేమాతిరేకంబునం గుమారుం గనుంగొని. ౭౮

క. రమ్మా చేరం జూడఁగ।
నిమ్మా నెమ్మోము కైక-కిదిదోసమగున్।
అమ్మానమ్మఁగనయ్యెడ।
బ్రహ్మనియు నెవిన్న భూవిభుండు కుమారా॥ ౭౯

ఉ. హారములొత్తి కందుభవ-దంగములిప్పుడు నిద్రలేక నా।
హారము మాని కానన వి-హారమొనర్చె నెట్లులోర్చునా।
హారమణీమణీగణము-హారమణీయవిలాసదైత్యసం।
హారము(గోరిపోయెదవ-హార్వతి తేజఁడ-వేమి సేయుదున్॥ ౮౦

వ. అని ప్రలాపించుచు. ౮౧

క. మ్రొక్కునలక్ష్మణుఁగనుఁగొని।
యక్కునఁగదియించి తస్ము(-డాయుష్వులయం।
దొక్కరుఁడు మెలఁగ లేఁడని।
నిక్కము మీయన్నతోఁడ-నీవునరిగదే॥ ౮౨

క. లక్ష్మీవంతుఁడు రాముఁడు।
లక్ష్మింబెడఁబాసి కాన-లకు నేగెడుచో।

క. విను మొకతఱి వసుహీనతఁ।
గనఁబడి గహనఁగుహవలయంబుఁ-గారించువిక।
ర్తనుఁ డై తాపము నొందిం।
చినదైవముగాఁ గనుసుఁభ-జింపఁగ వలయున్॥ ౯౭॥

వ. అని యుపదేశించి కానన గమనోచ్చణులగు సీతారామలక్ష్మణులం గనుంగొని. ౯౮॥

క. ఇంపగు రాజ్యసుఖంబులు।
సంపదలును విడచి యడవిఁ-జనియుందివురు।
ల్దుంపలు గాయలు నాకులుఁ।
దెంసితినుండను చునోసఁగి-తి స్నేలవకటా॥ ౯౯।

వ. ఇట్లు సెలవొసంగి వెచ్చనూర్చు జనయిత్రి సుమిత్రవీడ్కొని చిత్ర చరిత్రయగు ధాత్రీపుత్త్రియు సౌమిత్రియుం దోడరా నమిత్రగోత్ర లతాలవిత్రుండును, మిత్రగోత్ర పవిత్రుండును, గోత్రామర సుత్రామాద్యమర సంస్తోత్రపాత్రుండును నగు దశరథు నగ్రపుత్త్రుండు సుమంత్రసారథికంబగు రథం బధిష్ఠించి విత్రాసంబుగ నరణ్యయాత్ర గావింప నుద్యోగించు నవసరమ్మునఁ బురమ్మునఁ గల సమస్తజనమ్ములు నెట్టన నొక్కపెట్ట నతనిం జుట్టుముట్టి పెట్టిన సొమ్ములుం గట్టినపుట్టమ్ములు నెఱుంగక బిట్టుమూర్ఛిల్లుచు, నాహా యింతపుట్టునే యనువారును, నైక రట్టడికిట్టాడిఁ గట్టునే యను వారును, రాజునకించుక రయేని నక్కటికంబు వలదే యనువారును, నింతవింత గలదే యనువారును, రాముం డింత సాహసుం డగునే యనువారును, వారింపక గురుం డుపేక్షింపఁ దగునే యనువారు ను, మోమోడదు వాఁడు గాఁడు లక్ష్మణుండిట్లు పోవచ్చునే యను వారును, భరతుం డెఱుంగఁ డెఱింగిన నింత రానిచ్చునే యను వారును, దెలివంగూడి తెర వెఱుంగని యడవుల నిడుములం బడుట యొంతయు మోసంబనువారును, మహానుభావుండితనికి వ

నవాసం బనాయాసంబనువారును, జానకీసాధుచరితం బింత యొ
ప్పునేయనువారును, దైవకృతంబు దప్పునే యనువారును, వీరలం
గనుంగొన్నం బగవారికైన వగలు మిగులకున్నె యనువారును,
సుమంత్రుం డీ దుర్మంత్రంబు వారింపమి చన్నె యనువారును,
దెలియదీతని యభిప్రాయం బనువారును, యశంబు శాశ్వతంబు
ప్రాణంబు తృణప్రాయం బనువారును, ధరణింబడి పొరలువా
రును, ధరణీశ్వరుం గెరలువారునునై యేము నీతోడివార మిద
నిన్నుంగూడ నేతెంతుము గాకిప్పురంబున నుండ నేర్తుమే యని
యందరు నేకనిశ్చయంబున దాశరథి వెంబడించిరయ్యవసరంబున.

చ. దశదిశలన్ యశంబువిశ-దంబయి పర్వ వనంబునం జతు
ర్దశసమముల్ వసింపఁ బ్రియ-దారసహోదరసంయుతంబుగా
దశరథసూనుఁ డెంతయును-దంబుఘటిల్లఁగఁ జొరుతెల్లదు
ర్దశదురటిల్లనిట్టుపుర-రాజమునల్లననిర్గమించుచున్॥ ౧౦౧॥

వ. దశరథుం డధర్తనిర్భీకం గైకం గనుంగొని. ౧౦౨॥

ఉ. పాపముగట్టికొంటివిప్ర-పాలశిఖామణి రామునిక్కడం
బాపఁగనూహ వేసితివి-భార్య వెమ్మృత్యువవీవునాకునీ
పాపఁడు గాఁడె యాతఁడుగృ-పాపరతంత్రుఁడు భక్తియుక్తుఁడుం
బాపవిదూరుఁ డింకనగ-పాటుకరంబుభరంబుగానినీ॥ ౧౦౩॥

క. నముచిరిపుత్రుల్య రామున
నమునకునని చిలివిఘురాడి-నము మొదలుగ మో
సముఁ జేసిన నీదుని వా
సము చెంతకు రాను నేన-సము చిత చరితా॥ ౧౦౪॥

మ. అనితద్గేహమునగ్నిలగ్నమగుగే-హంబున్విసర్జించుఁ భీ
రునిచందంబునఁ బాసి హాసుత మహా-రోషంబునం జేసి కా
ననివాసంబుగఁ జేసినన్నధిక చిం-తాసాగరాంతర్నిమ
గ్నునిఁగా జేసి తెనీసి తేద్యయశముం-గుప్పించి తేదిక్కులన్॥ ౧౦౫॥

క. వాత్సల్యమహితనిజకాం।
వత్సరికులంద్రోల్చి చక్ర-వర్తి వగుదువా।
వత్సముని వైచ తురతః।
వత్సరములం దదిదియగ-వలెనా నీకున్॥ ౧౧౫॥

క. అన్న సుమిత్రాసుతవరా।
యన్నగరిశ్రీసుశాస-నాయతవనమం।
దున్నయపుడేమఱకఁ గొలు।
పన్నవరిగదవు ధైర్య-వంతుఁడవగుచున్॥ ౧౧౬॥

వ. అనిపలికి కోడలిం జేరఁగని. ౧౧౭॥

క. రాలచ్చువిదచియొడుగు।
తాలవజీయుం దుగ్రాల-తాలసునిప్పు।
లాలిలసువిహరింపసుజవ।
రాలా నీ కేమి జేద-రాల వెచెప్పుమా॥ ౧౧౮॥

వ. అనిపుతియుం బరిభ్రమితాంతరంగుండగు నమ్మహీకాంతుండు।

ఉ. వేగము గాఁగ నేగు రఘు-వీరుని తేరఁగ పాటులేమిఁజెం।
తాగిలి తాంతరంగగతిఁ-దద్రథకేతనదీప్తిఁ గాంచుఁడ।
చ్ఛ్రిగ నరామి వేదనను-జెందిశిదుద్ధితధూళిఁ గన్గొను।
నాగ్రిగము మీఁదద్రథప-రాగము గానక పంతఁ జేద్పుకున్॥ ౧౧౯॥

గీ. సుతియుఁ బెక్కుగుగతులన-మ్మనుజనాథుఁ।
డగ్రభార్యావరసతిస-హాయుఁడగుమ।
జిత్తమునమిత్తలముగ దుఃఖ్రోత్తసేయ।
పల్లముడుకఁ బ్రలాపిం ము-చుండునంత॥ ౧౨౦॥

మ. ఈడుగుం జేటికిఁ బౌరులార తన కా-నోద్యోగమం బింగము।
న్నడుపన్గాసక వెంబడింపఁగ సుమం-త్రుం డెంత యున్నాంతఁ జెం।
పడరం జయ్యనఁ దేరుద్రోల రఘువం-శ్య స్వామి శ్రీరాముఁడ।
ప్పడిరణ్యంబునకేగసామఁ జూడు ధూ-పుత్రి సమేతంబుగన్॥

స్తనమునఁ బొంగుచునటఁ గదే।
చనిసరయూపురాఁటి రాము-చంద్రుండు తలఁకన్॥ ౧౪౧॥

వ. అభంగ రంగత్తరంగాధారంబగు గంగాతీరంబున విఖండిత దుష్ట మృగాస్యక్కణంబగు నొక్కపక్కణంబు గనుంగొని తత్సమీపంబునకుం జని. ౧౪౨॥

క. బహునియమాయాసవహు।
స్మహుర్స్మహస్గతముద్రశు-ముక్తానివహుం।
గుహుఁగనిరచెచ్చివి కమ
గుహుసద్గుణగణగుహు-రఘుప్రవరులాగికన్॥ ౧౪౩॥

వ. ఇట్లు కనుంగొని రయ్యవసరంబున. ౧౪౪॥

చ. రభసముతో నిషాదపతి-రాము నెదిర్కొని సద్వినీతి భ।
క్తిభరితమానసుండగుచుఁ-దియ్యనిమాటల సాదరించి తత్।
చ్ఛుభతరదర్శనంబునని కుదమనస్కుఁడనైతినంచు మీ।
తభయరుఁ జేసుంగనర్ఘ్యసహి-తంబగు పాద్యమొసంగి తేరుగన్॥

క. నీపదశౌచజలమునకు।
నాపదలం బాపుహరజ-టాంతరపదసం।
దీపితవర్తనయైన సు।
రాపగకును వేలుగలదె-యానిత జ్జలమున్॥ ౧౪౬॥

వ. శిరంబునం జల్లికొని కొండియు. ౧౪౭॥

చ. గుహుఁడు నమస్కరించి నృప-కుంజర కుంజర కుంజరమ్యవీ।
గహనమునం బ్రబిరూసుజాలఁ-గైకొని యిట్లు చరింపఁ గామహా।
మహుఁ డవునీకుఁ జన్నె గుణ-మండన నాపుడు నానికి రఘూ।
ద్వహుఁడు నిజప్రవృత్తివిధి-తథ్యముగాఁ దెల్పి సంతసించుచున్॥

తే. రామచంద్రుఁడనాఁతఁ డా-రాత్రి మధుర।
వివిధమధురసఫలముల-విందొనర్చి।

మ, విలసత్త్వేషులువీతదోషులుజగ-ద్విద్వేషవిద్వేషులు
చ్చలసంతోషవిశేషభూషితమనీ-షాశ్లేషులానందభా
షులునిర్దోషులుముఖ్యసత్త్వగుణమం-జూషుల్జిగీషుల్హితై
షులుసత్పోషులురామలక్ష్మణులుసం-స్తుత్యాభిలాషుల్గదున్ ॥౧౫౭॥

వ. చని చని, ౧౫౮॥

మ, ఘనసౌగంధికగంధవాహచలిత-క్ష్మాభృల్లతావాలము
ద్వ్యమతాభంగతరంగశీకరసమా-విర్భూతశైత్యోల్లస
న్మునిసంకల్పితపర్ణవేశ్మసవిధా-మోదైణశార్దూలమున్
గనిరస్తోకవిశాలమున్మహితగం-గాహ్రాదినీకూలమున్ ॥ ౧౫౯॥

క, కనిజనకసుతాయుతులై
చనిమధుకరమధురనినద-సంభృతవికచా
బ్జవటన్మరాళసితగరు
దనుపమధౌతపరిధాన-యైతగుదానిన్ ॥ ౧౬౦॥

క, ఖ్యాతముగుదానిగంగా
ఖ్యాతంబగుదానిఁగుముద-ఘనకమలాసం
ఖ్యాకమగుదానిజనసౌ
ఖ్యాతతశీతలజలప్రి-యఁబగుదానిన్ ॥ ౧౬౧॥

సీ, తలఁచినయంతమా-త్రేజగజ్జనముల,
కానందసంధాయి-యైనదాని
బ్రహ్మహత్యాదిపా-పంబులనైనఁభ,
స్మంబుగావించెడు-మహిమదాని
హరుజటాస్థలినుండి-యవతరించినదాని,
రమణీయబహుళతీ-రములదాని
సగరవంశజులఁబు-ణ్యగతికన్పినదానిఁ,
బరమపవిత్రనా-బరఁగుదాని

గీ, సర్వతోముఖాకృతిని-మాటి గాఁగ।
నలికుల సమావృతములగు-నంబుజంబు
లలకలకు నుంగరుచిఁ దెలిపి-నలికములఁగ।
నొప్పు నుదుటి తిలకముఁ-బొల్పెఁ గాంచి। ౧౬౨॥

వ, ఇట్టి విధ విధ విశేషంబులకు సంతోషంబు నొందుచున్న యవస
రంబున రాముం గనుంగొని లక్ష్మణుండు, ౧౬౩।

క, గంగాసరసిని మంగళ।
యాంగజలతరంగమదభృంగ-ద్యుతి సుడి వడఁజా।
ల్లంగడఁ గిరిశశిరత్నా।
భృంగీకాంతలు పరాగ-రేణువులనిరా॥ ౧౬౪॥

క, నిజభావంబునఁ బొంగిమ।
మనుజనాయకుఁ డపుడు లక్ష్మ-ణున కిట్లనియెం।
త్రిజగత్పావనియగునది।
కుజనులకే చింత నిలువఁ-గొలఁ గాదు సుమీ॥ ౧౬౫॥

వ, అనిమఱియు ననేక విధంబుల నన్నదీచర్చఁ జర్చింపుచు మఱి జనక
సుతాలక్ష్మణసహితుండై రఘునాయకుండు గుహుండు నావికుం
డుగా నోడ యెక్కి సితగరుద్గరుత్సంభవంబు గాంచి బంధురకమ
లకైరవసుగంధంబు నాస్వాదించి తుంగతరంగఘట్టన నించుక పొదవి
శీతలశీకరంబుల యూఁతఁగొని మందమంద గమనంబున నొదు
రొత్తను మరుత్కిశోరస్పర్శనంబు నానందంబు నొందుచుండ నవి
మాలిన తనూవిలసనంబు నభ్యంతరస్ఫురదాశ్రితశోకవధేక్షణంబు
లనిరీక్షించియుండనివి సనకతను వెల్లనయనంబులు గావించికొన్నవ
దువృందంగందుగండకంబు పిండుల మండితయగు భాగీరథినుత్తరిం
చి పండుటాకులను కోకలఁ బతిచికేకికేకారవవ్యాజంబునం దిల్ప
చున్న యువ్వలియొద్దనందరణిశిఖరికొమ్మలను కొమ్మలుముమ్మరమ్ము
నంగుమ్మరించుసుమమ్ములను నాచారలాజమ్ములకు సమ్మతించుచు

గుహాంతరంబహుళతమఃపూర్వకంబుగా వీడుకొని ఛాయామాత్రంబు
లును బుచ్ఛశలాటుకంబులును గంబత్రపత్రంబులును ముఖకోర
కంబులునుంగలిగి జంగమకింశుకంబులనంగ గనంబున బారుశై
వాలుశుకనికరంబుల నాలోకించుచు విశీర్ణజీర్ణపర్ణంబులనించుకిం
చుకగనుపింపు పాషాణంబులకును మలకలు వెట్టుకొని నిదురించు
కొండచిలువలకును విభేదంబు పరిశోధించుచు గుసుమితాశోకా
శోకానోకహషండంబు దవనవసమావృతస్థలంబుగా శంకించుచు
మొట్టమొదలకులంబుట్టలు దిట్టముగ దాట్టినంబట్టుపుట్టంబులు చు
ట్టుగట్టికొన్న ట్టుగన్పట్టుచీకుఁ జెట్టులిట్టలకడ నిలువక దుస్తరంబు
లగు కంటకప్రస్తరంబులవలన నంజారు సౌరభలతాంతల తావితా
వితానంబులవలనను భయంకరపుండరీకభల్లూక సమీకంబులవలన
ను పారకృష్ణసారకిశోరవారభసలకిసలవిసరంబులవలనను మనో
భిరామభీమంబగుగహనక దధ్వగమనపరిశ్రాంతయగు నిజకాంత
నుద్దేశించి లక్ష్మణుంగనుంగొని. ౧౭౭॥

చ, అనవిభయంకరోరగస-మావృతమెంతయు సంకటంబున।
దెయ్యెడ విహరింపఁజాలవు చు-మీవలదంచు మగదుస్వదించు నా।
నుడివినకిందు వచ్చియుత-నుక్రమపాల్పడికంటకాంతవే।
న్నడివిధిరోఁచనేరకయి-నందలమెదలఁగందలుపఁగన్॥ ౧౭౮॥

క, నడికెదుఁజిత్తములోనె।
న్నఁజెలుంగనియట్టియడవి-నడుమంద్వరతో।
నడుమనిజాలదుజానకి।
నడుముల్పముగ చథరంబ-నల్పంబగుటన్॥ ౧౭౯॥

క, పుల్లాబ్జనేత్రపదములు।
నల్లికొనినతీవలొప్పె-నతివవ్యాకులతమా।
వల్లికినోడికదుంబ్రణ।
మిల్లిపదద్వయముపట్టి మిడికెనుకరణిన॥ ౧౮౦॥

వ. అనిపల్కి-మఱియు నమ్మహారణ్యమార్గంబునం జనువసరంబున॥
సీ. క్రోడవిదారిత-క్షోణితలముఁ గనుం,
గొన్న నిషాదులు-దున్నిరనుచు।
శల్యకప్రఖనిత-స్థలములఁ గనుఁగొన్న,
మునులు దుంపలు ద్రవ్వి-రనిరటంచు।
ద్విరదవిపాటిత-ద్రుమములఁ గనుఁగొన్న,
మరుఫలభారత-నొరగెననుచుఁ।
బొదలనిద్రించు బె-బ్బులుల శరీరంబు,
లరసి నబర్హి బ-ర్హంబులనుచుఁ।

గీ. కలభములఁ గన్నఁ బెనుగండ-శిలలటంచుఁ।
గుహలుగనుఁగొనఁ దపసుల-గృహములనుచు।
వెలుఁగ కుండ వచించుఁ దా-వెతఁ గనేని।
సీత భయమందునని యొడు-చింతకతన॥ ౧౭౧

వ. తదనంతరంబున నయ్యన్నదమ్ములు॥ ౧౭౨
క. ఘనకలుషపిశాచసుద।
ర్శనము సుదర్శనమనం బ్ర-శస్తము గుసుర।
ర్శనతీర్థముఁ గనిరచ్చట।
వనఘులు నివసన మొనర్చి-రారేయిఁ దగన్॥ ౧౭౩

వ. మఱునాఁ డరుణోదయంబునం గృతకాల్యకరణీయులై సీతాసమేతంబుగా నయ్యసహాయశూరులు ధనుర్బాణంబులు సహాయంబులుగా నాఁడు మూఁడు యోజనంబులరిగి॥ ౧౭౪
క. పటువిషమసలభయుదా।
వటముఖపురసాలతాల-వటముఖతరుసం।
కటమగు నట్టవిం జనియు।
త్కటము నలప్రయాగ వటముఁ గనిరా దాశరథుల్॥ ౧౭౫

వ. తదనంతరంబున గోడలిందలంచి. ౨౦౫

క. తరణికరతప్తమగువన।
ధరణిన్నడువంగలేక-తాపము మిగులన్।
దరుణీతరునీడలఁగా।
తరునింతియుఁబోలె మెలఁగ-దనవిధి చెయిదిన్॥ ౨౦౬॥

వ. అని పలవించి వెండియు॥ ౨౦౭॥

ఉ. డాయనురారిదేమి చెపు-డాయనుఁగానమెకాలు మీకుఁదో।
డాయను నొండ్లు మీకుఁబురు-డాయను నా వెతఁదీర్చువాఁడు లేఁ।
డాయను రామనీకయిన-నక్కటికంబొకయింత లేదు సూ।
డాయనుఁ దమ్ముఁడాయనుమ-హాటవికేఁగి తెబ్రతుఁడాయనున్॥

క. అనిమతియుఁ జెక్కుభంగులఁ।
దనయులఁ గోడలిఁ దలంచి-దశరథుఁ డతిశో।
కనిమగ్నుఁడైనఁ గనుఁగొని।
యనిరయింగౌసల్యశోక-సామర్షమునన్॥ ౨౦౯॥

ఉ. నీకువిచారమేలఁ ధర-ణీవర మేలతలంచి వాఁడవ।
కైకమనంబు నొచ్చుచునుఁ గన్గొని నీవిపుడింత వచ్చుట।
న్నీకువిచారమీకరణి-నీయగఁ జేసెఁగులంబు నెల్లనా।
హా! కరుణంబుదక్కభవ-దగ్రసుతుం జెడఁబాయుటర్హమే॥ ౨౧౦॥

చ. కలఁదోఁచు సమస్తవస్తువులని-క్కంబంచు భావించుమీ।
క్కలుచందంబున రాజ్యభోగములు వే-డక్కన్నమ్మి నాపుత్రునీ।
కలుగంధర్మమె పుణ్యకర్మమెదురా-త్మా! యీఁగఁ గాగాసిన।
క్కలవాశ్శే నివచందమయ్యె భవతా-జ్ఞాగౌరవంబియ్యెడన్॥ ౨౧౧

వ. అను నప్పలుకులు ములుకులక్రియం జెవినాడుటయు నప్పుడ
మికేఁడు. ౨౧౨॥

క. నాకడఁ బుత్రులు లేఁగమి।
నాకదలు విశేషముగు మ-నాటికొనియెనా।

హాకమలపత్రనేత్రము।
హాకష్టంపుత్రశోక-మునమునువినవే॥ ౧౧౩॥

ఉ. ఆనగుమోముసొంపు మెఱుఁ-గారెడుచెక్కులసొంపుగెంపుఁ గా।
లూనినమోవియింపు మధు-వొల్కెడుపల్కులతెంపుదీనసం।
తానముపైఁదలంపుసుఖ-దంబులపైనిటులీవగింపుము।
ధ్యానమునియందకానిమతి- చూడగనెయ్యెడనైనఁగల్గునే॥ ౧౧౪॥

క. ఓమగువ యసుశ్వసనము।
నామనవసింపఁజేయు-శోకవశమగు।
నారిమదోరిహికిఁబారిణయు।
శోకమునఁగానెట్లువచ్చుఁ-దోయజవదనా॥ ౧౧౫॥

గీ. హృదయముగలంగ నాముఖ-మిపుడుఁజొచ్చె।
శయ్యదలపోయఁగానంప-శయ్యయయ్యెఁ।
గాయమగ్గిఁబొరల్చిన-కరణియయ్యె।
నింతిబలవంతమగుపెను-తంతకతన॥ ౧౧౬॥

చ. అదియటులుండెవిన్ముజల జాననాచినవాఁడు వేడ్కనే।
యదురితహేతుఘోరమృగ-యావ్యసనగ్రసనాత్ముఁడనై।
సనమలచారుతీరతమ-పానదిచెంతనెసంగుకాననం,
బుదరిపిరియొక్కరుండవత-మోనివహంబునకుందలంకకన్॥ ౧౧౭॥

ఉ. అంబుజపత్రనేత్రశర-భాదిమృగంబులవేఁటలాడుకా।
లంబునమాటలాడకజ-లంబులకైయొకబాలకుండునేఁ।
గంబునవచ్చికుండమద-కంబులుముంపఁగశబ్దభేదిబా।
ణంబునఁదద్రణంబుఁగరి-నాధురణంబనిమూలనేసితిన్॥ ౧౧౮॥

క. కటకటతలిదండ్రులపర।
కటనడికొనిమోచితెచ్చి-కడునంధులకున్।
తట్టముగవొదవితృషఁదీ।
ర్పటకచొప్పటకరుగుదెంచు-చోస్వెనెల్లఁగన్॥ ౧౧౯॥

వ. ఇట్లువచ్చి మద్బాణవినిహతుండగుమునిసుతుండు॥ ౨౩౦॥

గీ. బాణహతినిప్డు విడలుమ-ప్రాణములకు।
వగవఁగమ్నలంగానక-పారకదశ।
నున్నవీడగుబు త్రశో-కోపహతిని।
దలఁచిహాకౄ-దనోతలి-దండ్రులార॥ ౨౩౧॥

క. అవితగమమఁగూలినఁద।
న్మనుజధ్వనికొంతయున్న-నంబవియఁగనేఁ।
జనికాంచితిఁదత్తటమున।
మునిసుతుమద్బాణనిహతు-మోహవిరహితుఁ॥ ౨౩౨॥

వ. కనిశీతలజలంబులందన్నయవముఖ ప్రత్యుత్తరంబుగానిం చుటయు॥

చ. వనుఁగమవిచ్చిచూచినర-నాథయిఋంగమిఁదిప్పచేసితి।
ప్పనిమదిలోగ్రహింఁచినఁగ్ర-పారహితాత్మకులైరయంబున।
న్నిఁతుఁబోలియన్నదీయజన-నీజనకుల్కపిలుంతురిప్డునే।
ర్పునఁజననీవుదేప్పుమత-పోముహీత్రవతులైన వారలఁ॥ ౨౩౪॥

వ. అనియిట్లు. ౨౩౫॥

క. తనతలిదండ్రులసంప్రా
రనమొనరింపుమనిచెప్పి-తత్తనయుఁడువేఁ।
దనువువిడచిచనియెఁబుచా।
తనజన్మకృతంబులెట్లు-తప్పింపనగుఁ॥ ౨౩౬॥

వ. అంత. ౨౩౭

క. వమ్మగునాదుభవమ్ముధ్ర।
వమ్మనుపెనుచింతతోఁజ-వమ్మునముదా్భ।
వమ్మననుదుకుచుశిశుకళ।
వమ్మునుగొనిపోవఁబదర-వమ్మువినిపెసఁ॥ ౨౩౮॥

క. అమ్మునివృద్ధులుసుతుఁడని।
నెమ్మనములఁదలఁచిపుత్త్రి-నీవిట్టుఁదవయుం।

గ్రమ్మినవగ పెల్లువమీ।
యమ్మయు నేసుమభయంబు-నందితిమిగదా॥ ౧౨౯॥

చ. కడుముదుపళ్ళముంగనులు-గావనివారము సైనమ్మునీ।
య్యెడవినిడించివిస్మితన-యాసలిలార్థమువోయి తెంతయు।
న్నడుమఁగ తేనివారలవ-నంబున నొక్కటడించివచ్చితిం।
డడయఁగ రాదటం చనుచు-నంబుచలింపక ధైర్యమొందనే॥ ౧౩౦॥

క. మాకన్నులుఁగర్ణంబులు।
మాకరచరణములుబుత్రి మాప్రాణంబు।
ల్లాకుఁగ లసమస్తమునీ।
కేకదనీవిట్లుమసలు-దేవదుకేయిక॥ ౧౩౧॥

ఉ. పాపఁడదు-పవాపుదుని-పల్కినపల్కిదయాత్ములారమీ।
పాపఁడగానుపాపిని-పక్షిరఘుండను పేరితుత్రగో।
త్రాపశదుండదుష్టమృగ-యావ్యపనోగ్రుఁడదగుఁజేయుఁడీ।
శాపశరాగ్నినీదృశద-శాపరిలబ్ధికిమీరలడ్డు నే॥ ౧౩౨॥

క. తమతమపూర్వకృతములు।
త్తనుతములకుమాన పెట్లు-తమకులకుడుఁగున్।
తమసానదిగొడ్డుసం।
తమసంబున వేటలాడు-తజేమీసుతుఁడున్॥ ౧౩౩॥

గీ. దృఢనియమములారమీత్రృప-దీర్పుటకును।
గటికిచీకటి పెక్కటి-నిటకువచ్చి।
యుల్లసల్లనసంతస-మగ్గలింప।
మొనసికలశంబునీరిలో-ముంచటయును॥ ౧౩౪॥

క. బుడబుడయనుచప్పుడుచ।
ప్పుడు వెడలినసామజమను-బుద్ధింగరుణం।
బుడిగిశరముఁదొడిగిపడఁ।
గడువడి నేసితినినియతి-గడువన్వశమే॥ ౧౩౫॥

క్షుటమగుబుత్రశోకమునఁ-గూరియుఁ భర్తృవియోగ మొందియుం
బటుగతినున్న వారలయు-పాపము రూపము లొందెనో యనఁగన్॥

క. వసుధాసుధాశనులఁ గొలిచి
వసుధర్తసభాని వాసి-వగు విబుధపతీ।
వసుధారుణశక్తిం గడు।
నసమర్థుఁడ వైతివిట్టు-లాశ్చర్యముగన్॥ ౨౫౩॥

వ. అని మఱియుం బెక్కుభంగుల విలపించి కౌసల్య॥ ౨౫౪

సీ. జననాథ నీమఱచు-సంబులు వలికిన,
ఫలమిప్పుడనుభవిం-పంగవలెఁ గదె।
గతివనిర్ఘాతప్ర-ఘాతంబు నదపించు,
జనునకుఁ గొలవిచూడఁ-డిదె విధమునఁ।
బుత్రవియోగతఁ-బొవయుచునుండఁగ,
భర్తృవియోగసం-ప్రాప్తమయ్యె।
వనవాసమునకేగు-తనయునిఁ గాంచిన,
మందభాగ్యవటం చు-మదిజనించుఁ।

ఆ గోపమోమదీయ-పాపవిశేషమో।
యొట్టినోముఫలమొ-యో సెఱుంగ।
నాగుణంబుఁ బిన్న-నాఁట నుండియు నెఱిం।
గియును బలుక వేమి-కృపదలిర్ప॥ ౨౫౫॥

వ, అని మఱియుం బరిచారికాసహస్రంబులుం దానునుం బలవించు నె
లుంగులు నింగి ముట్టె నయ్యవసరంబున॥ ౨౫౬॥

ఆ. పుత్రుఁగుఱిదిభూవిభుండు లోకాంతర।
వాసియగుట విని సు-వాసినీత్వ।
హానికొర్వలేక-నడలుచుఁ జనుదెంచె।
ధరిత దురితజాత-ధవళయాత॥ ౨౫౭॥

ఉ. తెల్వగనిట్టువచ్చిధరణీ-పతిఁగాంచిమునంబుసొవ్వఁగా।
నెవ్వరుదన్నుదూతిసస-హించివిలాపముసేయఁజొచ్చెనా।
జవ్వనిహాదినేంద్రకుల సాగరచంద్రముహేంద్రతుల్యసీ।
కివ్విధినవ్విధాతలిఖి-యించెనిపాపఫుఁజావుజావఁగన్॥ ౨౫౮॥

ఉ. కోరినకోర్కెలెల్లనొస-గూర్చెదవిప్పుడుమాటలాడవేఁగాఁ।
గోరినమారకుస్కెన్నృప-కుంజరధర్మువుగాదుశైకపా।
పోరుచరిత్రగావఁగృప-యుల్లమునందనయించపదాపుత్రరా।
వారలతోడనైనగరు-వంబుగఁబల్కకయుండఁజెల్లునే। ౨౫౯॥

వ. అనియిట్లనేకవిధదీనాలాపంబుల నారాజశవంబుఁ గౌగిలించుకొని దుఃఖించుచున్నయవసరంబున॥ ౨౬౦॥

క. విప్రప్రతిమానుఁడువి।
ప్రప్రభుఁడప్రతిహతప్ర-భావుఁడుప్రతియ।
త్నప్రమదవనాసలుఁడుయ।
తిప్రమదప్రదుఁడసుంధ-తీప్రియుఁడంతన్॥ ౨౬౧॥

ఉ. కాలవిధిజ్ఞతన్హృదయ-కంపముకింతయులేమిఁబెక్కుచం॥
దాలఁబరిభ్రమించునృప-దారలఁగాంచిగురుండువల్కెని।
ట్లేలవిలాపముల్సలుప-నిన్నరనాథునకిక్రమంబునం।
గాలవశంబుగొందముసు-గిల్గినశక్తఫలంబుదప్పునే॥ ౨౬౨॥

గీ. జన్మములనేకములొనర్చి-నత్సుతులను।
గన్నవాఁడురుకాలము-మన్నవాఁడు।
నహితరాజన్యసైన్యఘ-నాఘ్నిహోత్రుఁ।
డవునెయీతనిమృతికినిం-తవిలపింప॥ ౨౬౩॥

క. వగవకుఁడేలవగచెదరు।
వగచినమృతులైనవారు-వత్తురెయనుచుం।
దగుసంభాషణములన।
మ్మగువలనూరార్చిబోధ-మహితుఁడుమతియున్॥ ౨౬౪॥

గీ. తనయులిద్దఱు దశమని-దాత్రిశ్రవకుఁ।
దహనకర్త్మునదుప్రట-ధర్త్మనుగుట।
భరతశత్రుఘ్నులఁ బిలువ-వంగనపుడ।
బంపవలయును జాంఘిక-ప్రవరభటుల॥ ౨౬౫॥

వ. అనిపలికి సమస్తజనానుమతంబు వడసి దశరథుకళేబరంబు తైల
పక్వంబును సుగుప్తంబునుం గావించి॥ ౨౬౬॥

సీ. పటుజవసత్త్వసం-పన్నులభటులఁగ,
గ్గొనివసిష్ఠుండిట్టులనియెవారు।
కృతమతికేకయ-క్షితిపతిపురికున్న,
భరతశత్రుఘ్నులఁ-భరితయశుల।
గాంచిమిమ్ముమహా-కార్యంబుగల్గితో,
డ్తె-నితెండటంచుమీ-కులగురుండు
మములంబెంపెనివానీ-మామయానతినొంది,
వారునుమీరును-వడిగనిటకు॥

గీ. గదలిరండనిపలుకఁ దా-త్క్షణమయవ్వ।
సిష్ఠునకుమ్రొక్కి-వీడ్కొని-చేరఁజనిరి।
సప్తరాత్రంబులకు సుద-త్రుప్రధాని।
రమణఁకుదాఁగేకయ-రాజధాని॥ ౨౬౭॥

క, ఈఁకరణి వేగిలోపలి।
శోకము దెలిఁదోఁపనీక-సూచకశోధనునా।
కేకయభూపతిఁగనిమతి।
కైకాసుతుసోదరయుతుల-గనవతోంగుడున్॥ ౨౬౮॥

క. చెడుకలలుగాంచిచింతిం।
చెడుభరతుఁడు వారిముఖము-శేశయములఁదోఁ।
చెడుదైన్యముఁగనుఁగొనె।
చ్చెడుచిత్తముతోదమిగులఁ-జెడిమదివడుదున్॥ ౨౬౯॥

వ. ఉన్నంతనభ్భటపుంగవులు॥ ౨౭౦॥

ఉ. హృదయవికారము ల్దెలియ-నీయక నాత్మనిఁ గాంచి గూఢగా।
ద్గదికఁ దెలుంగులోప్పఁబడఁ-గాధరణీశతనూజమూగుతుం।
డుదమానతేజుఁ డాప్యుఁడుగ-డుస్వపఁదోడఁ బ్రనిరందుశాత్రవో।
న్నదహృతిచారుకీర్తిపరి-ణాహరతుం భరతుస్ససోదరున్॥ ౨౭౧॥

క. అని చెప్పి వాఁడు పనియిది।
యని చెప్పుండవ్వసిష్ఠుఁ-డని వినిభయుం।
బున రాముని కెవ్వారి।
గ్గొనరించిరొ తండ్రియెట్టు-లుండెనొ యనుచున్॥ ౨౭౨॥

ఉ. మేషువడంకసోదరస.మేతుఁడు కేకయరాజపుత్రికా।
సూనుఁడు దిగ్వధూజనక-చోపరిశోభితకీర్తిసూనుఁడా।
స్థానము సొచ్చి మామఁగని-తద్వచమంతయుఁ దెల్పి బంధుసం।
తానము సంభ్రమింపవిశ-దస్థితి నిట్లనియెన్ భయంబునన్॥ ౨౭౩॥

క. నా మనవి నాలకింపుము।
నా మనము గలంగె నీక్ష-ణంబయ యోధ్యా।
నామనగరికేఁగ గతు।
నా మనవారలజాడ-వరిగె వవనఘా॥ ౨౭౪॥

క. అని తనమామయు భాజి।
జ్జననాయకు వీడుకొని ల-సద్వసనసువ।
స్తుని కాయమాతఁ డోసఁగిన।
గొనిభరతుండనుజుఁ గూడి-కోసరయముగన్॥ ౨౭౫॥

క. సముచిత పరివారసమే।
తముగా సాకేతరాజ-ధానికిఁ బురుషో।
త్తముఁడబ్భరతుఁడు సనియె।
భ్రమితహృదయుఁడగుచు వేగ-రపుబయనములన్॥ ౨౭౬॥

వ. ఇట్లు చని. ౨౭౭॥

గీ. రమణిలేని గృహమునంబ-రమణిలేని।
యాపంచు శూన్యమని సైజ-మైనభంగి।

న్న పురిఁ గాంచి విపులవి-పణిహర్మ్యదయముఁ।
డగుచు నిట్లని తలపోసె-నాత్మలోన॥ ౨౭౯॥

చ. తనపతి లేనిమానిని వి-ధంబునఁ జాలఁ నమంగళంబునై।
దినయది యుస్వరంబుగ దు-దీనమనస్కులు పౌరు లెవ్వరిం।
గనినను మేలువల్కరు-ఘనంబగు ఖేదనినాదమింతయుం
న్వినఁబడదేమి యీ యొక-పృథివీపతి మేనుఁ దొలంగె నే మొకో॥

వ. అని వితర్కించుచుం జనిచని. ౨౮౦॥

శా. సత్రాసస్థితి నార్తిమూర్తి నిధరిం-చం బోలు నానాప్రథా।
గ్యత్రాతాపశహృత్త్రపార్తియయుదై-న్య స్తోమసంస్థాయిగై।
శత్రుఘ్నుం డడుగుల త్యాను జొఁ-డుపశ్చాద్భాగ సంవర్తిగా।
మాత్రాగారముఁ జేరఁ బోయి భరత-క్ష్మాపాలుఁ డత్యాదృతిన్॥

ఉ. కేకయరాజనందనకు-గృత్రిమభంగి నమస్కరించియు।
కేకయరాజు సేమమెఱిఁ-గించియు కించుక తాల్మిలేమినం।
శ్యాకరిమార్తికాకరము-గాఁ గతమేమి పురంబు నామదిన్।
శోకము సేయఁ జొచ్చెఁ గల-చొప్పు సమస్తమెఱుంగఁ జెప్పుమా॥

క. మనమున భయసంభ్రమములు।
బెంగొన నిట్లను గుమన్న-బ్రియనందనుతో।
మునఁ బాడిగ్గి నిలిపి కేకయ।
తనూజ యిట్లనియెఁ గాఢ-ధైర్యస్ఫూర్తిన్॥ ౨౮౩॥

ఉ. విూజనకుండు దొల్లి నను, మెచ్చి వరద్వితయంబొనంగెఁ బు।
త్రాజట లూనియగ్రవని-తా సుతుఁ డబ్దచతుర్దశంబున।
వ్యాజము నిష్ఠితిన్ వనవి-హారమొనర్పఁగ నీవు సర్వధా।
త్రీజనమాన్యడశ్వసుమ-తీపరిపాలనమాచరింపగన్। ౨౮౪॥

క. అగ్రసతీసుతు విభవో।
దగ్రునిఁ గావింపనాత్మఁ-దలఁచదు రాశా।
ప్రగ్రహానిబద్ధబుద్ధిన్।
పాగ్రణి నడిగితి నయోగ్య-మగు సమయమునన్॥ ౨౮౫॥

యతివనీగర్భమం-దావిర్భవించుట,
కకటా పూర్వజ-న్మకృతి మొకొ।
ముద్దులుగులుకు రా-ఘువిముఖాంభోజంబుఁ,
గనుఁగొనఁ జాలంకఁ-గలుగదొకొ।
మాతృవీకపటంబు-మనముననిడికొని,
కౌసల్యవసఁగని-కనలునొకొ।
గీ. యొకొ యడుగునడువ-నోపదుజానకి।
యెట్లుపడవిసంచ-రింపునొకొ।
జనులుభరతుఁడమిత-సౌజన్యనిధియని।
పొగడుదురువులింక-నెగడవొకొ॥ ౨౯౩॥
వ. అని పలికి కిన్కవొడమి. ౨౯౪॥
ఆ. నిన్నుఁజూడరాదు-నీతోడఁభాషింప।
రాదు నిన్నుఁజంప-రాదు నాకు।
నిచటనుండరాద-హీనపాపమతీయ।
టంచు వెడలిభరతుఁ-డనుజుఁగూడి॥ ౨౯౫॥
వ. అత్యంత చింతాక్రాంతాంతఃకరణుండై దీనమనస్కులగు కౌసల్యాసుమిత్రాదేవుల కడకుంజని నమస్కరించి కన్నీరుమున్నీరుగా వెడ్చుచున్నంగనుంగొని॥ ౨౯౬॥
క. చిత్తంబులనుత్తలముఁ।
గ్రొత్తలగుదునత్తరణులు-గొడుకులదుఃఖా।
యత్తులనెత్తిపదంపడి।
మొత్తంబుగ కేడ్చిరొక్క-కొంగినభమదురివక॥ ౨౯౭॥
వ. మఱియును శోకవిధంబుఁ బలవించె నెఁ గౌసల్య॥ ౨౯౮॥
చ. భరతుఁడ రాముఁ డుగ్రవన-వాసము సేయఁగఁ బోయె యుసద్యకో।
భరతుఁడు రాజముఖ్యుఁడు భ-వజ్జనకుండమరత్వమొందెడు।
ర్భరతర పుత్రశోకమునఁ-బట్టణమా నెఱ రాజకంబు సం।
భరితము నుప్రమోదనిర పాయతఁ దాల్పుము రాజ్యరాజ్యముల్॥

వ. అనుటయుసహింపక॥

చ. చకితహృదబ్జుఁడై పుడమి-సత్తముఁడభ్భరతుండు వెచ్చనూ।
ర్పికనుకఁదకి-విస్మితగఁ-జెప్పెదనామదిరాజ్యవాంఛలే।
మికిఘనపంచభూతములు-మిత్రశరాంకులుసాక్షులీవెఱుం।
గకిటునావ్వఁబల్కె-దను-కంపఁదలంపపుకోసలాత్మజా॥ ౩౦౧॥

క. అనితఁడురామభక్తుం।
డనూనపుణ్యాత్ముఁడు-డిమ్మహాత్ముఁడుభరతుం।
డనినయదిశిధ్యముచుఁగ।
గనవాణితచించెఁదగ స-కలజనులవినఁగ॥ ౩౦౨॥

వ. ఇట్లువచించుటయు నెల్లజనంబులు నచ్చెరువునొంది భరతుం బ్రశంసించిరంత॥ ౩౦౩॥

క. భరతునిఁగాఢాదరత।
త్వరతంగౌసల్యమెడలు-వట్టుకొనివిశే।
షరవంబునేడ్చెంద।
త్వరిచారికలధికశోక-భరమునఁగేడ్వఁగ॥ ౩౦౪॥

వ. తదనంతరంబున భరతుండనుజసహితుండై తైలద్రోణినిమగ్నాసం గ్రహించియున్న పితృశవంబుఁగనుంగొని యుల్లంబుజల్లనొల్లం బోయి తల్లడంబుపెల్లివిరియనల్లమృతుండగు నభ్యాగల్లభతల్ల జంబేరొక్కన॥ ౩౦౫॥

క. పేర్మిమాస్పదవినుమామా।
తామహాపురిఁజూడఁజనిప-దంపడిరామా।
తోమాటలేదవేటికి।
రామద్రోహులముగాము-ర జవతంసా॥ ౩౦౬॥

క. పురిపాలనయదిభవ।
త్పరిపాలనేమిఁజేసి-పరిపంథితర॥
పరిపాలనపండితత।
త్పరపార్థివవంశముఖ్య-పక్షిరథధ్యా॥ ౩౦౭॥

క. వసుఁజాపవృష్టి కాసుతుఁ
డనుతలపునఁ జేసి ఘోరమగుమూర్ఛ మునిం
గెన ప్రియపుత్రమశత్రు
ఘ్నునిగాఢావరత నెత్తి కౌవవిదితను నేఁ॥ ౩౦౯॥

వ. అనిమతియుండదడీయగుణంబులగ్గించి విలపించి సచివులూఱడించి నఁదెలివినొందక పితృమరణశోకానలసంతప్తచిత్తుండగు భరతుం గనుంగొని సకలగుణోత్తరుండగు గురుండిట్లనియె॥

చ. శతసరవాధులనిత్రిపురుఁ జక్క్రఁడచెవ్వివిధాగమార్గసం।
పతఁ బ్రశస్తుఁడాపరిత-బాంధవుఁ గుంగడువృద్ధపుణ్యక।
ర్తతుఁడుమహీశలస్తునుస-మస్తముఁదాల్చి నభోగియోగతిం।
గతిఁపుపేదనంబడుట-కార్యగమెయిస్నరవాధమాలికై। ౩౧౦॥

సీ. ఒకయిల్లువాసివేరొం-డొకయింటికేగిన,
వాసిజీర్ణములగు-వసనములను।
రోసినూత్నచ్ఛదో-ద్భాసియైనట్టులు,
గాదెదేహాంతర-గమనమాత్మ।
కకుజరామరణాది-వికృతులాతనికిలే,
వమలుఁడక్షయుఁడున-నామయుండు।
శాశ్వతుండనవిరం-జనుఁడనవిలసిల్లు,
నింతయేఱుంగక-నితరజనులు।

గీ. పంచభూతాత్మకంబుమ-ర్భలమురక్త।
మాంసమేదోస్థిదమ్ము-మలినమశ్వ.
రంబునగుమేనిచేటున-కుంబొగలుట।
తలఁచిచూడవివేకమ-తంబు గాదు॥ ౩౧౧॥

క. బంధురమగుజ్ఞానమునం।
బంధములేనిమనముఁ బ్రబంధకమగున।
ద్బంధుమరణశోకాంధత।
బాంధవుఁగూలుదురుధ్రు-వంబుగజనముల్॥ ౩౧౨॥

క. అన్నదిసదృశీకృతసువి।
యన్నదినటుఁగనుచి భరతుఁ-డతిరయమునఁ దా।
పన్నదిశకుఁగురుతోఁ దా।
వన్నదిమదినూఁదినడచె-వనుజసహితుఁడై॥ ౩౨౯॥

వ. ఇవ్విధంబునంజని రొమసెడ వినోదంబులగు వదీనదంబులు తుం
గంబులగు గిరిశృంగంబులు విశాలంబులగు సాలంబులు సాలో
కించుచు సరయూ గంగా సంగంబు నుత్తరించి గంగాతీరంబు
నకుంజని యుండు. ౩౩౦॥

ఉత్సాహవృత్తము.

సాధునీతిఁగనిరొ రాజ-సత్తముండసత్తతా।
శాధుగీవిదాఘునవఘు-తాళితాత్మశాదుని।
స్వాధునిష్ఠఁదీనసత్ప్రి-సాధునిద్వసన్నసీ।
పాధురంధరుంగుహాన్వి-పామనిర్వ్యపాదునిన్॥ ౩౩౧॥

వ. ఇట్లు కాంచుటయు నగ్గుహుండ నాదరపూర్వకంబుగా భరతున
కిట్లనిరొ. ౩౩౨॥

క. ఇలువెలువరించిరామునిఁ।
కలిమింగొనియంతనిలువ-కకలుషమతివై।
బలిమిమెయినతనిఁదలపడఁ।
దలఁచియరిగెదిట్లుకుత్స-తంపువలఁపునన్॥ ౩౩౩॥

చ. అనవతఁడో నిషాదవిను-మట్టులుగాదుమదగ్రజన్ముఁ
జ్జనకసుతాసమేతున్నృప-సత్తము రామునిలక్ష్మణుంజగ।
జ్జనునుతకీర్తినైద్వపద-సాధ్యకరోధ్యకుఁదోడితేముదం।
బునవిటుపోకనీకగునె-పోకడమాలినపలుకు-వల్కఁగన్॥ ౩౩౪॥

చ. అనుటయుసంతసించియతఁ-డాతనికిన్వహితార్ఘ్యపాద్యముల్।
ల్పనుపడఁగానొసంగఁదగు-భంగిగఁగంగఁదరంగిణీముఖం।
బొంతఁగనుత్తరించిగుహుఁ-బోవిపవిరించిరించిశృశ్యమై।
వ్వరికిఁలఁఘునీయమని-వార్యచునంచుఁదలంచుమన్వసన్॥ ౩౩౫॥

వ. భరద్వాజాశ్రమంబునకుం జని॥ ౩౩౬॥

క. అమ్మునిపతికి నమస్కా-
రమ్మొనరించుటయు నాద-రమ్మున నిటురా
రమ్మని భరతుని కరముఁ గ-
రమ్మునఁ గీలించి మునిక-రమ్మునరక్తిన్॥ ౩౩౭॥

క. మనమున వగదక్కి మునీ
జనకుఁ డమ్మృతిఁ బొందె విధివ-శమ్మున నిటురా
మనిఁ గానఁ బోవు టెంతయు
నమరూపంబయిన కార్య-మని సెలవొసఁగన్॥ ౩౩౮॥

క. వనవొప్ప రాముఁ డరిగిన
వలను భరద్వాజమౌని-వలనఁ దెలిసి య
వ్వలఁ జనియె భరతుఁ డెంతయు
వలమద గుల్వడిన పులుఁగు-వలె వెతభయుఁడై॥ ౩౩౯॥

వ. ఇట్లరిగి విచిత్రకూటంబగు చిత్రకూటంబు సమీపంబునకుం జను నవసరమున॥ ౩౪౦॥

ఉ. ఎప్పుడు రామచంద్రుముఖ-మేర్పడఁ జూతుము కన్నులారనిం
కెప్పుడు రామభాషణము-లింపుగ వింటుము వీనులారఁగా
నెప్పుడయోధ్యవాస్తవుల-నేలఁగ వచ్చును మిత్తులారయం
చప్పుడు వేడ్కఁ బౌరజను-లారని రావము లుప్పతిల్లఁగన్॥ ౩౪౧॥

క. పలికెడు పలుకులు తురగ
మ్ముల హేషలు మత్తనాగ-ముల బృంహితము
ల్గలసి బలిసి యశ్రోణం
గలశకునంబులకు భీతి-గలిగించుటయున్॥ ౩౪౨॥

క. తద్రవముం బక్షిమృగో
పద్రవమున్ లక్ష్మణుండు-పరికించి యదు
గ్రద్రుమము నెక్కి కనియెన్
భద్రంబుగ వచ్చుచున్న-భరతుని సేనన్॥ ౩౪౩॥

తాఁ గ్రమ్మఱ మ్రొక్కె నా రాము।
స్వామ్యమ్మునఁ జేఁదుల లక్ష్మణానుజన్మసహితుఁడై॥ ౩౭౩॥

వ. ఇట్లు మ్రొక్కి కుశాసనంబుల నాసీనులైయున్న యెడ రాముండు.

చ. అనుజులఁ గాంచి సేమ మొకఁ డావర సాధునకన్న యన్నతో।
వనఘులు వారలో పితృద-యామతి భూపతి దానతివ్యథా।
జనితభవద్వియోగఘన-సాగరమీఁదఁగ లేక వానిలో।
మునిఁగిన వాఁడు దైవకృత-మున్నరు వేర్పడ లంకఁ ద్రోయు నే॥

చ. పరమకృపాకరుండు గుణ-బంధుఁ డాగమవేదకీర్తితో।
త్వరమతిమాన్యతవ్రతుఁడు-హారిశశీలి విశారదుండునం।
బరమణిపంశ వారిహిమ-భానుఁడు బాహుబలాధికుండు భూ।
వరమణి యైన తండ్రి విడు-వన్వల సెన్నవల స్మహీశ్వరా॥ ౩౭౪॥

క. సమత మున కు రాజేయుఁ।
సమయింపఁగఁ జాలు బరవ-సముగలపతి దా।
సము సెన్నీరలు వెనవా।
సమునొందిన యెడ వదివ-సముచమహాత్మా॥ ౩౭౫॥

చ. అనుటయు వారి పల్కులుమ-హాశనికల్పములై నయాలకి।
ర్తనవినిపాతపాలము వి-ధంబున నేలకు వ్రాలి రాముఁడా।
తని క్రియ లక్ష్మణుండు వసు-ధం బడియొవ్వసు ధాత్రి నాజయుండి।
చెను పగవంత నెంతయుఁ ద-పించుచుమూర్ఛయునిం గనంతటన్॥

ఉ. ఇంచుక సేద దేఱి వసు-ధేశుఁడు రాము విభుండు చాలదుః।
ఖించె దుఃఖములరగ విప్ర-కృష్టతరంబగు నార్తి క్రమ్మఱ।
న్వాంచిన నించుకేని యము-నాధృతి చాలమిఁ దండ్రి నూర్చి శో।
కించె నుదంద్రిపోక యసహా-కృత్యరితాపము సేయకుండు నే॥ ౩౭౬॥

ఉ. వెండియు రామలక్ష్మణులు-పలువిధంబులఁ దండ్రి నూర్చియా।
ఖాండకుశేశహాదఖర-ధ్రప్రభుసత్తమ రాజరాజవే।
దండసుకుండదండధర-దండధరోపమకీర్తియంచునో।
ప్పంచఁగ నేడ్చిరంత యాయు-హీనజనంబులభంగి నార్తులై॥ ౩౭౭॥

క. ధృతాత్ముఁ డగుచుఁ దవయిరు।
చేతులుఁ గదుఁబిసికికొనుచుఁ-జెడి ముడివడు మ।
న్నీతవఁగఁ జదివికొఁగి తె।
ధాత్రీతురగచారుకీర్తి-ధామా! రామా॥ ౩౬౧॥

వ. అనిమఱియుంబలవించు నవసరమ్మున ౩౬౨॥

శా. కైకానందనుఁ డన్నదమ్ములను భూ-కాంతా సుతం దాపకృ।
చ్ఛోకాపాస్తసమర్థవాక్ప్రకరసం-శుద్ధార్థలోకాతిశాం।
తాకృష్టాత్ములఁ జేయుచున్ నిహిరణం-శ్యస్వామి రాముండు గం।
గాకూలంకషుఁ జేరి యందు నిగమో-క్తప్రక్రియం జయ్యనన్॥ ౩౬౩॥

క. అనుజప్రియాసహితుఁడై।
మనుజప్రవరుఁడు దదంబు-మగ్నాత్ముఁడై।
జనకునకుఁ దిలోదకవిధు।
లొనరిచె దిక్కృతకృత్యుఁ డగుచు-నుటజము సేరెన్॥ ౩౬౪॥

ఆ. ఇట్లు వచ్చి రాముఁ-డెరియు మునంబున।
నముజవరులఁ బట్టి-కానమువారు।
గాకుగప్రతిభ్రాతె-నాకుగవాతిఁ గూలు।
నగమువట్లు పుణ్య-నగమువందు॥ ౩౬౫॥

వ. ఇవ్విధంబునం బితృమరణ శోక వ్యాకులిత మానసుండైన రామచంద్రు భరతుండూరార్చుచున్న యవసరంబున గురుండు కౌసల్యాకైకా సుమిత్రలం దోడ్కొనివచ్చి సముచితంబుగా దర్శనాగమనంబు నడపుటయు రాముండు సీతాలక్ష్మణ సహితుండై కన్నీరుటులఁ దదంఘ్రిపుష్కరభాగంబులఁ దడుపుటయు నక్కాంతలు కొడుకులం గౌఁగిలించి దీవించుచు నక్కలం గదియించి వెక్కి వెక్కి యొక్క గ్రుక్క దిక్కులదరఁ బిట్టు లేడ్చిరి. మఱియును.

ఉ. ఎల్లజనంబులున్ వినఁగ-నీల్గిన పఙ్క్తిరథుం దలంచుచుం।
దల్లి తొరుసద్గుణావి-తానమునప్పుడు పేర్కొంచునా।

తల్లులుమువ్వురున్సుతులు-దారుణశోకభరంబునొందిరెం।
తల్లడమందియేడ్చి రవి-ధంబది యెచ్చటనైనఁ గల్గునే॥ ౩౬౭॥

క. క్షత్రియకాంతలు కోసల।
పుత్రియుఁ గైకయసుమగధ-పుత్రియు వగతోఁ।
బుత్రుల ధైర్యము ధాత్రీ।
పుత్రీ దైన్యంబుఁ గాంచి-పొగిలిరి మిగులన్॥ ౩౬౮॥

వ. అప్పుడు. ౩౬౯॥

ఉ. నాకులపాలికేగి జన-నప్రభు మామఁ దలంచి చింతతో।
నాకులపాలికాతిలక-యైన ధరాసుత యేడ్చె నేడ్వఁగా।
నాకులపాటుఁ జెందఁగను-నాత్ములఁ బువ్వరపాత్రులొల్కుచు।
నాకికులుం దద్విలాపమున-నానమునా దమదిండలంపఁగన్॥ ౩౭౦॥

వ. తదనంతరంబున వసిష్ఠభరతప్రయత్నంబునం గొంతవడికిం గౌస
ల్యానందనుండు దెలివినొందుటయుం దక్కినవారు నుపశమిల్లి
రంత నంత పౌరజానపదబ్రాహ్మణగురుబంధుభృత్యామాత్యప్రియానుజ
ప్రియాసముపేతుండై పవిత్రసమస్తలసుఖాసీనుండై రాముండు చితవ
చనంబుల నానందంబు గాంచుచుండి కొండొకసేపునకు భరతు
నానవంబునం బ్రసాదమహితంబగు చూడ్కి నిగిడించి పితృనిర్ది
ష్టదిష్టంబిష్టంబుగ వనంబునం గడపి పురంబునకేను వడివచ్చునంత
కుం గరుణఁ గలిగి ప్రజాపరిపాలనంబొనర్ప నయోధ్య కరుగుము
న్నాయని సప్రేమసాదర బహుళంబుగా నాడుటయు నతండు వి
షాదంబు నొందియన్నంగనుం గొని॥ ౩౭౧॥

ఉ. భూతలనాథనాథ రఘు-పుంగవ నక్షోధముదక్కి నన్ను నీ।
శీతలదృష్టిఁ జూడుము వ-చించెద రాజ్యభరంబు సర్వము।
న్నాతలఁ బెట్టఁ జూచెద వు-నాతల పట్టుల గాదు నీవు ధా।
త్రీతలమేలఁ గావలవ-దేజగమెల్ల నుతించుచుండఁగన్॥ ౩౭౨॥

క. ఇనవభ్యుదయంబునఁ జా।
క్రనిశాయము రాజకరుణఁ-గనికువలయమం।

క. మనచోటివారజనకుని।
పనుపున వర్తింపకునికి-పాడియొ గుణహా।
డనీవెఱుంగవె ధర్మపు।
సమఁగావింపకుము రాజ-సంగ్రహయింక౯॥ ౩౮౭

క. పితృభక్తిశీలయుతుఁడై।
పతిపూజాపరుఁడవగుచు వసుమతియలరం।
ధృతిమంతుఁడవై వత్సర।
చతుర్దశము ద్రోవుమీ ప్ర-జలఁ బ్రజాక్రియ౯॥ ౩౮౮

చ. అనుటయు నేమియుందిరుగ-నాడక యుబ్బరతుండు రాముచం।
ద్రనిఖిలభూభరంబు సుక-రంబుగ దాల్చుటయుంక నాకుఁదా।
ప్పనిపని యేనినీ చరణ-పాదుకలానతియిమ్ము తన్ముఖం।
బున మదరాజ్యతంత్రము ప్ర-మోదమున న్నొనరింతు నెంతయు౯॥

క. అనితనుఁ బ్రార్థించెడుతి।
మ్మునకుం బాదుకలొసంగి-మోదంబునరా।
మనరేంద్రుఁడు గౌఁగిటనిడి।
కొనిసంభావించెనతఁడు-గుతుకము నొందఁ౯॥ ౩౮౯

గీ. భరతశత్రుఘ్నులంత సం-భరితసత్త్వ।
హర్షమాన్యాంగులగుచుఁద-దంఘ్రియుగము।
మస్తకంబులఁ సోఁకన-మస్కరించి।
యపుడు వీడ్కొని రతని నా-నంతరమున॥ ౩౯౦

వ. శ్రీరాముండు దమ దెసకు మ్మెలిం చు మమ్ముత్వారత్ములకుం దాపోపత్గో
షణంబులగు భాషణంబుల నానందంబు నొందించి యొక్కి వీ
డ్కొల్పి పౌరబ్రాహ్మణ భృత్యామాత్యజనంబులకు సముగ్రహప్ర
శామాదరసంభావనా పూర్వకంబుగా సెలవొసంగి వసిష్ఠానుజ్ఞా
తుండై సీతాలక్ష్మణసమేతుండై మగిడి పర్ణశాలకుం జనుటయు॥ ౩౯౧

గీ. పాదుకలు భద్రకుంభికుం-భస్థలమున।
బాదుకొల్పి మదంబున-భరితయశుఁ।

భరతశత్రుఘ్నులుభయపా-ర్శ్వములఁ బిములఁ
చామరచ్ఛత్రములుఁబట్టి-చనిరి సరగ॥ ౩౭౭॥

వ. ఇవ్విధంబున సమస్తబంధుజన పరిజనగురు పరివృతుండై చిత్రకూ టంబువిడిచి భరద్వాజాశ్రమంబుఁగడచి గంగాతీరంబునకుఁడ చి రట్టియెడ. ౩౭౮॥

క. తత్కాలలతాపాలస
ముత్కరకలికాసురభిస-ముత్కటసుమసం
పత్కలితమగుచుఁదమక
త్యుత్కలికమరుత్కిశోర-ముత్పాదింపన్। ౩౭౯॥

క. దర్శనమాత్రముననఘా
దర్శనమొనరింపఁజాలు-తేన్నద్యుదక
స్పర్శనగంగాలోప
స్పర్శనమునఁబ్రీతులైన-సమయమునందున్॥ ౩౮౦॥

గీ. ఎదురువచ్చినగుహునకు నిష్టమొసఁగఁ
దాము వోయినకార్యమం-తయును వినిచి
యతనిదైనసహాయత-నధుఁడు దాఁటి
రంగములుపొంగఁదుంగత-రంగగంగ॥ ౩౮౧॥

వ. ఇట్లు సమస్తజనసమేతులై గంగానదీసముత్తరణంబాచరించి గుహుండు వనుపనుచిత పయనంబులంజని తమసాస్రవంతింగడచి సాకేతసామ్రాజ్యంబునకుంజని. ౩౮౨॥

క. పల్లివిరియుతల్లడమున
దల్లులనందునిచియద్భు-తపుమూలబలం
బెల్లను గాపునిచియనం
బొల్లమినప్పురముఁజొరక-యుచితంపుమెయిన్॥ ౩౮౩॥

క. స్వర్గాభ్రమునజ్జ్వలవ
త్స్వర్గాభ్రమువలెకదు-యశఃపుంజంబుల్।

దిగ్గ్రామలగప్పఁగనం
దిగ్గ్రామమునన్వసించి-నిష్ఠాపరులై॥ ౩౯౪॥

వ. ఉచితపరివారసమేతులై యుండి రంతనబ్భరతుండు॥ ౩౯౫॥

చ. సుఖమునధారుణీజనులు-సొంపువహింపలసత్సుఖశ్రియో
న్ముఖమునధారుణీసురస-మూహము పెంపుగలిర్పఁ బాదుకా
ముఖమున రాజ్యకృత్యముఁ బ్ర-మోదమునన్నడుపంగ రాజధ
ర్మఖనియనన్వసించెమతి-మంతుఁడు రాముని రాక వార్చుచున్॥

వ. ఇట్లయోధ్యాపురసమీపంబున నొక్క యలంతిపల్లియం దుచిత వర్తనంబుల నుండెనని చెప్పి ప్రమదాతిరేకంబున. ౩౯౬॥

శా. దైతేయప్రకటాటవీదహనభ-క్తత్రాణపారీణసు
జ్ఞాతానాగతవర్తమానగతదిష్ట-ప్రక్రియాసన్నుత
ఖ్యాతాఖ్యాతికృపారసప్రవహితా-లాత్మౌతిసంభావితా
జ్ఞాతావాసమునీంద్రమానసనివా-సాపీతవాసాంచితా॥ ౩౯౭॥

క. పంకజలోచనమునిజన
పంకవిమోచనవిశేష-భాసురశ్రీవ
త్సాంకకరుణాంబుసేచన
పంకజభవకామివీప్ర-భావితవచనా॥ ౩౯౯॥

మత్తకోకిల.
పాలితాఖిలలోకనాయక-భక్తసౌఖ్యవిధాయకా
కాలభీకరసాంపరాయక-కాలకాలసహాయకా
కాలనీరదకామనీయక-కాయజిత్సుమసాయకా
శీలయుక్తఫలప్రదాయక-శీలవేంకటనాయకా॥ ౪౦౦॥

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యాన పరాయణ భూమ
ధైర్యవినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ క్రొ
త్తపల్లి లచ్చయ ప్రణీతంబైన దాశరథివిలాసంబను మహా
ప్రబంధంబునందు దృతీయాశ్వాసము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# దాశరథివిలాసము.

## చతుర్థాశ్వాసము.



క. శ్రీకాంతావరముఖనా।
శ్రీకాంతరమహితపుష్పలిట్కృతపీఠా।
నాకావాసాసహావమ।
హాకరిహార్యక్షు వేంకటాద్ర్యధ్యక్షా॥

వ. దేవా తదనంతర కథావిధానంబవధరింపు మట్లు భరతుండు ధర్మ
నిరతుండై నందిగ్రామంబున నివసించెనని చెప్పి యప్పుట్టువుఁ
దపసి వెండియు నిట్లనియె. ౨॥

ఉ. తమ్మునిఁ గాంచి రాముఁడు-సుధారసతుల్యములైనవాఙ్మ కా
యమ్ములనట్లునంగ్రమున-మన్యవనంబునకేగి శ్రీవిశా।
లమ్మగుపర్ణవేశ్మమున-లక్ష్మణనిర్మితమేని దాసమి।
పమ్మగుటాత్మనెంచిమన-పజ్జకునబ్బురతుండు గ్రమ్మఱన్॥ ౩॥

క. వచ్చుముఁబోవుమనున్న।
స్వచ్ఛమువిఘ్నంబువిపినవాసంబునకే।
వచ్చుపడందల్పితినిఁక।
నిచ్చోసుంపఁజనదవలి కేగనయు స్వర్॥ ౪॥

వ. అనుటయు మహానందంబు నొందుచుండ నచని॥ ౧౧॥

సీ. ఆఖుశాబకశేలి హానసామూజికా,
వర్తితపటుతర-గర్తములును।
వాతాయమాన వ్రాత ఘోరవ్యాఘ్రము,
కులసమాకీర్ణవి-కుంజములును।
మృగరిపు ప్రకరగం-ధగజేంద్రసంఘాత,
దంతురితగిరిగు హాంతరములు।
భీతికృద్గోతు వా-రాతశకుశాని,
కాటవంచితతరు-కోటరములు।

గీ. శ్యేనజాలకపోతసం-శ్రితమహావి,
శాలమహనీయభూరుహ-సాలములును।
గలిగి విదలితఘనపథి-కనియమిజన।
తాశ్రమంబగునొక తాప-సాశ్రమంబు॥ ౧౨॥

వ. కనుంగొని యప్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించియుండు॥ ౧౩॥

క. అనసూయాహృదయేశ్వరు।
ననసూయాహృదయకమలు-నత్రిమునీంద్రుం।
గనితత్పదంబులకువం।
దనమొనరించుటయు నద్భు-తశ్రమదమునన్॥ ౧౪॥

క. దీవించి రాముఁగని ముని।
భావంబలరారనర్ఘ్య-పాద్యంబులసం।
భావించియంతరమున।
భావభవనిభున్ సుమిత్ర-పట్టిని మిగులన్॥ ౧౫।

వ. సముచితసత్కారంబుల మనఃప్రియంబు గావించి రామలక్ష్మణులం బవిత్రకుశాస్తరణంబుల నాసీనులం జేసి కుశలంబడిగి తానును సముచితాసీనుండై మధురసంభాషణములం దేల్చుచున్న యవసరంబున।

మ. అనసూయాచరణారవిందములకు-త్యంతానురాగంబు గాఁ।
దాసీమంతగతోల్లసద్ఘుసృణముం-దాంకించి చేదోయివో।

య్యనజోడించి నమస్కరించుటయున-య్యాత్రేయి ధాత్రీసుతా।
వాజాతాయత నేత్ర నెత్తికొనియెఁ-వాత్సల్య సంపూర్ణయై॥ ౧౭॥

వ. ఇట్లాశీర్వచనపూర్వకంబుగా నెత్తికొని నిజవిశాలపర్ణశాలామధ్యంబున సుఖాసీనఁ జానకినుద్దేశించి॥ ౧౮॥

చ. సుఖములరోసి కాననవ-సుంధరకుం బిత్రాజ్ఞ నేగుదెం।
చిఖరకతాత పంబునఁగ్రా-ఁగించెదు భర్త పిఱుందనవ్వన।
స్సుఖముదలిర్పనుండెదవు-ముక్తిధ యసీతి వైపతివ్రతా।
త్వఖనిజానీవు నీకుసరి యెత్తు రియ త్తనుమ త్తకాశినుల్॥ ౧౯॥

వ. అనిమఱియు ననేకవిధంబులఁబొగడి॥ ౨౦॥

గీ. అభిరామకము సుభగ-తాభివృద్ధి।
యగునిదిధరించు వారల కనిఁ చించి।
కంబుకంఠికిఁ గొంగ రా-గంభొసంగె।
వత్తపశ్వినియను రాగ-మతిశయిల్ల॥ ౨౧॥

ఉ. ఈకరణి స్మునీంద్రసతి-యిచ్చినరంగు నంగరాగముం।
బ్రాకటలీలఁదాల్చి కడుఁ బ్రార్ధనసేయఁగ నామెతోడని।
ర్భీకుఁడు రామమూర్తిదను-బెండిలియైన చరిత్ర మెల్లసీ।
తా కులకామినీమణిము దంబునఁదెల్పియనంతరంబునన్॥ ౨౨॥

సీ. అత్రిభార్యకు వినయంబునఁబ్రణమిల్లి,
కులసతీధర్మము-లొక్కొక్క మిగుల।
వినవాసచేసెద-వినిపింపుము నవుఁడు,
నయ్యవనీజాత-కాదరమున।
భర్తమాటకుమాఱు పల్కకుటతలవాకి,
టనెలంగుటయుఁబాయు-సముసోకర్తు।
సేవించుటయు ముని షిద్ధముల్భార్త కు,
రూపియైనపారిష్ఠ-చూపిఁగాఁగ।

గీ. మదినిరూపింపమిక డుదు-ర్మార్గముగుడు।
హాత్తరంబుగ నాత్మక-యాత్తయగుట।

క. కంతముఁ దగ నలకూబరునిఁ
గుంతీతుఁ డైపాండు నేలఁ-గూలెడు నెడ సో
త్కంఠులగుచు నిలకు జీకిరి
కఁ ద్రిపథము ల్గిరిండి-గను లలుకుకరణిన్॥ ౪౦॥
వ. ఇట్లు లంఘించి జానకీభయంబు వాపి యుల్లసిల్లిరంత. ౪౧॥
గీ. రాము బాణనిహతిఁ గంధ-రంబు ద్రెస్సి
యక్షణమ రామలక్ష్మణు-లబ్బురపడ
శాపమోక్షంబుఁ గాంచిని-శాచరుండ
గర్వుఁడగు తుంబురాఖ్యగం-ధర్వుఁడగుచు॥ ౪౨॥

ఉ. చెంతకు వచ్చి రామనృప-శేఖరుఁ గాంచి నుతించుచు న్నిజో
దంతము నంతయుం దెలిపి-తత్ప్రతిబిడ్డ్కనియాక్షణంబని
శ్రాంతమున స్వర్గకేచర-సింహుఁడు వోయిన మాన వేంద్రుఁడ
త్యంత సవిస్మయాత్ములగు-నట్టి ధరాతనుజానుజాతుఁడై॥ ౪౩॥
క. అరిగి భయంకర వనములఁ
దిరిగి తిరిగి యమిత కీర్తి-ధిక్కృత గంగా
శరభంగు విశరభంగుని
శరభంగగహితుఁడు రామ-చంద్రుఁడుం గనియెన్॥ ౪౪॥
క. కనితచ్ఛరభంగపదా
బ్జనికటతల ఘటితఫాల-భాగుం డైయు
మ్మునిపతి నుతింప నతఁడు
మ్మనుజేశ్వరు నెత్తి మిగుల-మన్ననఁ గనియెన్॥ ౪౫॥
వ. గాథాపర పూర్వకంబుగాఁ గౌఁగిలించి కొని యనంతరంబ మొగ్గి కెల్లనిలిచియున్న ధరిత్రీపుత్రీసుమిత్రాపుత్రులందరు భంగి సంభావించి యుత్తమోత్తములకు వర్త్యపాద్యంబులొసంగి మధురంబులగు కందమూలఫలంబుల నాతిథ్యంబు నడిపి సుఖోపవిష్టుండగు శ్రీరాముం గనుంగొని శరభంగుండు. ౪౬॥

చ. ఘనబలభేదినాకభువ-నంబునకుం బిలువంగ వచ్చిన
న్వినుమటువోకనిమ్నఁగను- వేడుక నిల్చితిఁ జూడఁ గాంచితి
న్మనుజవరేణ్య నీవలర-మాఫలితార్యజనాదరుండవున్
ఘనత నెసంగు నీకరుణ-గాంచినవారికిఁ బ్రాతె సౌఖ్యముల్ ॥౪౭॥

క. త్రిదశజగన్నివసనమున
బవవాసంబును ద్వదీయ-పదదర్శనసం
పదకునదృత్తంబు లెతల
పదశరథతనూజభూమి-పదయామూర్తీ ॥ ౪౮॥

వ. అనిమతియుం బ్రస్తుతించి॥

క. అలరుం దేనెలఫలముల
వలకులవజనోత్తరీయ-కాదులనలకా
నలరుచిరములగుదలిరుల
నలరులసద్భదయుండగుచు-నమ్మునిరొయసఁగన్ ॥ ౪౯॥

వ. పరితుష్టుండై యమ్మహాత్ముఁడిట్లని, ౫౦॥

క. సాలంబులునరుణరుచికి
జాలంబులు గీరసంత-సాలంబులువా
చాలమ్ములగు వికమ్ముల
జాలమ్ములు గలిగి కడువి-శాలమ్మగు చున్ ॥ ౫౧॥

సీ. లలితారుణప్రవా-ళలతాకదంబమై,
ప్తారమై హరికులా-ధారమగుచు
వరభూరిఫేనరా-యూరుచంద్రికిరణాను,
కూలమై మహితవి-శాలమగుచు
ఘనహనీయగండక-మదజలమాతంగ,
ధామమై రాజీవ-ధామమగుచు
వరరాశికనయగు-వనరాశిఁగనుఁగొని,
రాఘవుండనుజగో-త్రాసుతాస

గీ. మేతుఁడై చనిసద్గుణో-పేతుఁ గనిరి।
వయ్యరణ్యాంతరంబున-నధికనిష్ఠఁ।
దపమొనర్చుచుహోత్రకాం-తవిమలాత్ముఁ।
దీక్ష్ణకరకోటిధాముసు-తీక్ష్ణనాము॥ ౫౨॥
గీ. కాంచియాతనిమన్నన-గాంచి సన్ను।
తించియమ్మౌనియాజ్ఞ వ-హించిమించి।
తన్నుఁ బ్రార్థించుమునులయా-ర్తమతపోవ।
నంబులను జూడఁ బోయెన-యంబుమీఱ॥ ౫౩॥
వ. అరిగి ప్రియానుజ ప్రియాసహితుండగు నా రాఘవుండు॥ ౫౪॥
సీ. మునికుమారులకుఁ గ-మ్మనిఫలంబులు దెచ్చి,
యొసఁగి లాలించుచు నొక్కచోట।
పారికాంక్షులతపో-భవనాంతికంబుల।
నుటజముల్గట్టుచు-నొక్కచోట।
వాచంయమికథిత-వరపుణ్యకరకథ,
లూఁకొనియలరుచు-నొక్కచోట।
తాపసులకునుప-ద్రవములు గావించు,
రక్కసులను ద్రుంచు-చొక్కచోట।
గీ. ఋషివరేణ్యులకజినో-త్తరీయకాదు।
లొసఁగిదీవనలనుగొంచు-నొక్కచోట।
నొప్పుమునిమన్ననలుగొంచు-నొక్కచోట।
రాముఁడుచరించిసుగుణాభి-రతుఁడుమఱియు॥ ౫౫॥
క. మునిజనఘనహితవర్తన।
మునఁగొన్ని దినంబులచట-మోదించుచు రా।
మనరేంద్రుఁడు వారలవీ।
డ్కొని తిరుగ తిమందకర్ణి ఘోరతపంబున్॥ ౫౬॥
వ. కావించునప్పుణ్యాశ్రమ సమీపంబున నరుగునవసరమున॥ ౫౭॥

సీ. సితపీతకాంతులఁ-జెన్నొందిపథికుల,
కతిమాత్రకామోద-మావహింప।
శాకవైశాఖాశ్రయ-శాఖానిరంతర,
చ్ఛాయమైవలపులు-సందడింప।
మృదుశిఖాకర్బుర-మేచకకేకావి,
నీలపింఛంబయి-నెమ్మిగింప।
నిజరసోల్లాసిత ద్విజవిసరంబయి,
యింపుమీఱెసురుచు-ల్వెంపరాము।
గీ. వామపార్శ్వంబునఁ జనుసుమా-వలఁ జేలు।
బాలసహకారషండంబు-పజ్జ కేగుఁ।
గాఁతమాయూరవరవాట-కంబుఁ గాంచుఁ।
గొప్పపండులు గోయున-కొల్లనయందు॥ ౫౭॥
వ. ఇవ్విధంబున ముదంబునొందుచు, శ్రమంబున గుందుచు, తలం
కుచు నడఁకుచు వెసవెస నడుగిడుచు పుడమిపట్టిం గనుంగొని
రాముండు. ౫౮॥
క. యాసముఖితరువిసరమా।
యాసము రానేలవలవ-దడవిక మగుఁ జా।
యాసము చితిముగ మున్నద।
యాసమధికవృత్తిఁ దెల్ప-నదివినవుకటా॥ ౬౦॥
క. లాయమ్ములురిపుజనవిపు।
లాయమ్ములు సంతతవిపు-లాయమ్ములువా।
లాయమ్ములుమనకిపుడులు।
లాయమ్ములుభయదఖగకు-లాయములయ్యెన్॥ ౬౧॥
క. కాంతారమ్ములనుచుతర।
కాంతారమ్ములఁ జరింపఁ-గానోపు దెస।
కాంతారమ్ములను లికదు।
కాంతారమ్మునమువిభుఁడు-గాఁగిఁటఁ జేర్చెన్॥ ౬౨॥

వ. ఇట్లు బహువిధోపలాలనంబుల నలరించుచుండు నంత నయ్యన్నద
మ్ములు దుర్గమారణ్యమార్గంబుల నప్రమాదులై చని చని యొ
క్కడాఁడు. ౬౩

ఉ. రాసుతులర్క-వంశవన-రాశిసుధాకరులెంతయేనిసం।
త్రాసముఁ దర్క-వంశవన-రాశిసుధాకర మైనశోభదా।
త్రీసుతఁ గూడి చొచ్చి విహ-రించిరి రాముఁడు లక్ష్మణుండును।
జ్ఞాసనకృత్య మేరితర-మానుగ డంగి తొలంగఁ బెట్టఁగన్॥ ౬౪॥

వ అది మఱియును బ్రవృద్ధాశ్వత్థప్రవృద్ధ కపిత్థవటాశోక దాడిమీ తరుసంభృతంబును పారిజాతకామాత్రిక శ్లేష్మాతక పిండీత విభీతక కేతకీభల్లాతకీ జంబూ జంబీరాదుంబరనింబభూనింబకదంబ కదంబ భూమిజంబు కాష్ఠాంబక కాకోదుంబరి కాంబుజభూమిజంబు కాముఖానోకహ సంకులంబును శతిసారక హంసమారక కుమారక కలికారక పనమయూరక సాల రసాల తమాలకృతమాలతూల తాలహింతాల నారికేలఖండీలాంకోలకుద్దాలనక్తమాల సాలవిశాలంబునుం గలిగి త్రివిష్టపంబు విధంబున రంభాసురభ్యైరావత మందారేంద్ర సురసామృతాన్వితంబై ప్రధానధరాత్రిమంబున కుంభీస్యందనవీరతరుధనుశ్చాపణాంచితంబయి నభోమార్గణంబు చందంబున తరణివసుమనోహారంబయి యధోభువనంబుకైవడిన నంతాశ్రయంబయి సత్యలోకంబు ప్రకారంబునఁ బ్రహ్మణ్యశారదాగాయత్రీసముపేతంబయి జటీసమూహంబువడువునఁ జటీకాశికశాండిల్యలోమశ కపిలానుకూలంబయి కైలాసంబు పోలిక పాశుపతహైమవతీ శివాధికంబయి, బలిసద్మంబునకువోలె, కితవ పలాశరాక్షసీ సంయుతంబయి యభయాధికంబయ్యును గురుక్షేత్రా లర్కభయానకంబయి బుక్షపున్నాగ మయూరారిష్ట వ్యాఘ్రనఖ సమన్వితంబయ్యును బుక్ష పున్నాగమయూరారిష్ట వ్యాఘ్రనఖ సమన్వితంబయి నాగవల్లీలవలీలతా బహుసుతా త్రివృతా ద్రాక్షావలీలతా బహులతాభిరామంబయి యొప్పు నయ్యె

రణ్యంబునందర్లు ప్రవేశించి పెంటులనెదుటఁ బెట్టికొని మెట్టకో ట్టగోనలం బురులువిప్పి యాడునట్టి నట్టువపిట్టతిట్టలం గాంచి హర్షో త్కర్షంబునొందుచు నొక్కొక్కపట్టునం బుట్టలనిక్కినిక్కి దిక్కు లుచూచు గోధేరంబులంబట్టికొన నుంకించు శబరశాబకులం జట్టి కొని పోవుశైపోవుసారమేయంబులకు దూరంబుగాఁ దొలంగుచు, బండిగురివిందతీవచప్పరంబులనీడలం బండి విశ్రమించుచుం బండి నకంటకఫలంబుల ఫలంబు లుపయోగించుచు, స్కంధాగ్రంబు లను మున్నెక్కి సితదనంతరంబున న్నిసువులకు నిజలాంగూలదండం బు లూతలుగా నొసంగి యెక్కించుకొని శాఖాగ్రంబులం దను కుశాఖామృగంబులసహాయంబ పేక్షించుచు, నకులంబులు తెలివాన కులంబుల విదళించు నేర్పునకుం బొంగుచు, భుజంగసమాలిం గితమ్ములగు ద్రుమమ్ముల కొమ్మలు భుజంగాలింగితలగు కొమ్మలం బోల్పఁ బట్టగు ప్రదేశంబులం దిరుగుచు, ననేక విధ మార్జాల జాలంబుల నాలోకించుచు, సారంబు లగు కృష్ణసారంబుల వారంబు తీరంబులం జాలు సారవంబు లాలించి, ఘోర క్రూ ర మృగంబులుగా శంకించి పరికించుచు, కమలాకర తీర మ హీరుహాగ్రశకున విపతితంబులగుఫలంబులు జలంబుల బుడుంగు బుడుంగుమనుచుం బడు చప్పుళ్ళు మెప్పొదవ నాలకించుచు, ను త్తుంగంబులగు పర్వతశృంగంబులనుండి వెలువడి జలజలఁ బ్రవ హించు శైలయేళ్ళనుకరించు పూదేనెవాకల సమీపంబుల నిల చుచు, వింతలగుకస్తూరావులు పెదవల్లుకపురంపుటనఁటి బోఁడయ లవాకసికొనిపోవుచు, రేపకడనమేల్కొని యొరలువెట్టి పిల్లలనెఱి కలనితికికొని యొదిగి నిదురించు కాఁరుకోడిపిట్టలం బిట్టులికించు చు, సర్పవృశ్చికంబులకు వెఱవక వెరవున వెలుతురునకై వత్తి వో టంగలిచిపట్టికొని యల్పవిశాలంబులగు గిరిబిలంబులందూఁటి చని యందునిదురించు నేదుపందులం గదకాళ్ళు వట్టికొని వెఱకీడ్చి కొనివచ్చు నిషాదుల సాహసంబున కచ్చెరువు నొందుచుఁ, బథ

ష్మువఁదమ్ముఁ గాంచి భక్షణమ్ముగ్రమ్మిఁగొన రయమ్మునం బాఱుతై సాలు
శశకాది క్షుద్రజంతునికరమ్ముఁ గరమ్ముఁ గనికరమ్మునం బోవిడుచు ము
మృగయాపరిక్షిప్తవిషాక్తపృషత్కంబులు మనుబోతులం గ్రుచ్చి
కొనియుచ్చి చనిన వేగంబునం గాడిన వాడిన శోకలగు మావిమో
కల నాలోకించి యాకులంబు నొందుచు మఱియుఁ గొన్ని సంక
టస్థలంబులం బాదంబులం దీవ లల్లికొనినం బోఁజాలక మిట్టిమిట్టి
పడుకణుతుల సమీపంబునకుం బోయి బంధమోక్షంబు గావించు
చు నాశ్రమంబులగు తాపసాశ్రమంబుల చెంతం గాసారంబుల తీ
రంబులం బర్ణశాలలు విశాలంబులుగా నిర్మించికొని వశించుచు,
వల్మీకబిలంబుల వెలువడి దీర్ఘజిహ్వాపల్లవంబులు సాచి చిఱుచీమ
లం జవిచూచుచు నలుకువోపమిం జుట్టుజుట్టికొని కాలికిం జిప్పల
పోరి వుగన్పట్టఁ గొంతవడికి భయంబుదీఱిన నెప్పటియట్ల తిరుగ వా
రంభించు వాలువల నాలోకించుచు, వివిధమధుమధుర ఫలపలం
బుల వాకలి వుచ్చుచుఁ, బువురాల్చు తరుషండంబు తారకాఁహీ
తంబగు నాకాశంబుచందంబుగా వితర్కించుచుఁ గంఠీరవంబులకుం
దీత్కంఠంబునఁ గుంభికుంభస్థలంబులు వగులించిన వందలిక్రొ
మ్ముత్తియంబులు రాలుటగా నెఱుంగక బదరీఫలభ్రమ దట్టంబు లగు
పత్రపుట్టికలం బెట్టుచు, కటపాగంబుల సమాంసమ్ములగు నెమ్ములఁ గ
నుంగొని చిఱుతపులులల్పమ్మార్గంబులం బట్టి యచటఁ బెట్టికొని భ
క్షించుటగా నూహించుచుఁ దరుశిఖరకులాయపరనిక్షిప్తనిజాండ
గ్రవనోదితకృష్ణసర్పసమాలోకనజనిత మహాశోకరోష వేగ పరిభ్ర
మితపక్షులార్తనాదంబులకు గనికరించుచు, మచ్చికలమ్మాపం బె
చ్చువెఱఁగి పచ్చిపట్టులకువచ్చి మెచ్చువిచ్చలవిడి మేయుచు
న్న సారంగంబు చరమాంగంబు లధిష్ఠించి తత్తూర స్పర్శనం
బున న్నీఁది కొగయుఁ శలభ విసరంబుల సరభసంబునం బట్టికొ
ని ద్రుంగిక్రమ్మఱ నెప్పటియట్ల రెక్కయాఁకులం బాగంబులు
చూపి యుల్లసిల్లు భరద్వాజంబుల నభివీక్షించుచు, నిలువిల్లం జ

లిచీమలు గఱచిపట్టినం దాళఁజాలక తరులతాగుల్మంబులు పొల్వ
డంగొట్టికొను మెట్టపొట్టపింజరుల యుపద్రవంబులు దప్పించి
కొని పోవుచు సార్ద్రప్రదేశంబుల విహరించియుం బుష్పరసం
బులు పుక్కిలింపబట్టియు వచ్చుచుంబోవుచున్న జుంటీఁగలవెను
వెంటందప్పకచని క్షుద్రపటలనిష్కుహమ్ములగునవోకహమ్ములం గ
నుంగొని తన్నిమిత్తసమారూఢభల్లూకవ్రాతంబులందోలి తద్గర్భమ్ము
లంగరమ్ముఁజొనుపుటకుఁ గరమ్మునిఱకటమ్మై వశమ్ముగాకున్నం గొన
గోళ్ళనవియించి కాఱుమధుధారలం దోయిళులంబట్టి గ్రోలియుం
దనివిసనక జాలి నెఱియలం జేతులువఱపి మధుకోశంబులందీసి యొసం
గినంబొట్లంబులుగట్టు నెడనెఱుంగక చిన్ని పూఁదేనెపొరలంబురువు
లతుట్టెలనిపారవైచుచిన్నవారలంజూచి నగుచు మరలనేరించుచెం
చునాయకులవింతమాటలకు సంతోషంబునొందుచు ఫణిఫణామణి
తోరణ విశాలపాలసౌధాంతరజ్యోతిరింగణదీపికాదీపితవృదుగు
రుచ్ఛ సుమలతాకాయమాన మధ్యప్రదేశ మకరందపరిక్షాళిత శి
లాతలాసీనభిల్లపల్లవాధరీ వినోదమధుర వేణువాదంబులకుఁగరం
గుచు నిజతంతుసంతానంబుల గుల్మాంతరమ్ములు నిరంతరమ్ములుగా
గప్పటాకారంబున నేర్పవల్లినానిం దగులొక్కనిచిక్కునకీటకం
బుల దంశంబు లుపదంశంబులుగా భక్షించు నూర్ణనాభంబుల
యాలోచనంబులకుఁ దలలూఁచుచు తేఱుల సందడిం జెదరిపో
యునసమయంబునఁ బొంచిచని కోరిల్వాలు సలుఁగులంబట్టికొని
పోఱునెడ నిజశాబకంబులొవరించు సార్త్రిఁదెలుపుఫూత్కారంబు
లాలించి గ్రక్కునం గలసికొని వ్యాఘ్రంబులనిగ్రహించి పిల్ల
ల గుమింగలపికొని పొదల సంతసంబునం బొదలుచు ఘుర్ఘు
ర ధ్వానంబులం బుడమి వ్రక్కలించికొని యొక్క పోవు
గా నిదురఁ జొక్కియున్న స్తబ్ధ రోమంబులం దెలుపుచు
శుష్కవంశాన్యోన్య సంఘట్టనోద్భూతప్రభూతవనహుతాశనజ్వా

లోకలాపంబునకు సహాయంబైన మధ్యాహ్న సమయోష్ణకిరణోష్ణాసహిష్ణువులై మడువులంబడిపొరలు సైరిభంబులనిభంబులుగా నభివీక్షింపుచు, మృతమృగకళేబరదుర్గంధగర్తవర్తనధూర్తమృగధూర్తసమాఘ్రాతంబులకు రోయుచు, చమరీమృగవాలవ్యజనవీజనోజ్జనిత మరుచ్చలల్లతాలతాంతడోలికాసంస్థితంబులగు మిళిందబృందఝంకారంబులకు వినోదంబునొందుచు, వనశుకంబులు వెనుకొనంగను కనిం బాతి యశ్చారిందోలంగఁ దమ్ముం జేరిన రురువారంబులం గటాక్షించి తద్విరోధంబులగు జంతువుల వదలించుచు, మనోహరవిపరీత భయానకంబులకుఁ దానకంబులగు ఖగమృగస్వనంబు లాకర్ణించుచు, నిరోధిత తరణికిరణప్రసరణ తరులతాశిఖర పరిపక్వఫలప్రతిబింబిత తారకాకోరకప్రకరంబునుంబోని ఫణిఫణామణిప్రభాపటల ధగద్ధగితంబున కచ్చెరువునందుచు, వనేందిరాకిసలయహస్త పరిస్రస్త ముక్తాఫలక్రమాభివీక్షిత బాలతృణాంకురాగ్రమాలికా ప్రతిభాసిత హిమానీబిందుసందోహంబుఁగొనియాడుచు. [illegible]ండారంబఁడిన దొండపండులదండం దండిగఁ జెక్కిన జిగురుం గండెలం దండోపతండంబులుగా బెండువడి పడిన పీలిపిట్టలం బట్టికొని మెచ్చువచ్చు కచ్చులం బుచ్చుకొను శకునాంతకుల చెంతకుం బోవుచు, దివాచర నిశాచర మృగపక్షి ప్రచరణంబువలనను గమలకైరవ వికసనోన్మీలనంబువలనను ప్రభాకరోదయకాలాస్తమయ కాలనిరూపణంబు గావించుచు మెట్టయుడుత పిల్లలంబట్టి విడుచుచు శార్దూలంబులం దోలుచు తరక్షువుల శిక్షింపుచు శరభంబుల సరిపెట్టుచు గవయంబులం గడతేర్చుచుఁ గణుదురులకుం దొలంగుచు వాడిగల ముండ్లు గాడినం దూఁగాడుచు నన్యోన్యదైన్య సంశోషణంబులగు సంభాషణంబులాడుచు వర్షాతపహిమానీ నివారణంబుగా గుజ్జుమావుల పజ్జకుం బోవుచు గుసుమవిసరంబులేఱుచు నీరంబులం

దూఱుచుఁ గొంతదూరంబుచనిచని యొకకానఁ డొక్క పుణ్యా
శ్రమంబుఁ గనుంగొని యందు. ౧౫

మ. భవనారణ్యభవప్రతీతసుగుణభ్రాజిష్ణు వింధ్యాద్రిదు
ర్భవనాగారిఖగాధిపున్ యమిసంభావ్యప్రభావాఢ్యునిన్
భువనారాధ్యు నిమాత్రితవ్యుళికితాంభోరాశినక్కుంభసం
భవనామ్ముంజగదేకవంద్యు మునులోపాముద్రప్రాణేశ్వరున్ ॥౧౬॥

క. కని మ్రొక్కి సీతారా
ముని గ్రక్కున గ్రుచ్చియెత్తి మునిమక్కువనే
కొనకొనఁ జక్కఁగ దియుచు
నను దెక్కలుఁ జొక్కఁ దుము నోమోదమునన్ ॥ ౧౭॥

ఉ. అంబుజమిత్రగోత్రకలశాంబుధిసోముని రామునిం బ్రమో
దంబునఁ గన్నపుత్త్రునివిధంబున నెంతయు నాదరమ్మునన్
బంబువహించెనో యనఁగ బస్మని దేల్చె సుఖాసనార్ఘ్యపా
ద్యంబుల నిష్టవాక్ప్రవిచయమ్ముల నిట్లలరించి వెండియున్ ॥ ౧౮॥

క. లక్ష్మణుఁ గృతలక్షణుఘను
లక్ష్మణు మన్నించి తనకులసతిని చెనా
లక్ష్మీసమానయగుజన
కక్ష్మాధీశసుతఁ బూజఁగావింపంగన్ ॥ ౧౯॥

వ. నిరూపించి రామలక్ష్మణుల నుచితాసన సమాసీనులం గావించి మ
ధురవచనరచనల నలరించి రాముం గనుంగొని. ౨౦॥

ఉ. కాయము వొంగ నిన్నుఁ బొడఁగాంచితి ధన్యుఁడనైతి నాదినా
రాయణమూర్తి వీవు ముని రక్షణకై యిటు లుద్భవించినా
వాయవనీతనూజభవదంగన పంకజవాసిలక్ష్మి నా
నీయనుజుండు లక్ష్మణుఁడు నిక్కము శేషఫణీంద్రుఁ డారయన్ ॥

చ. త్రిదశవిపద్దశాహృతిగుఱించి విరించి స్మరించినన్ ధరి
త్రిదశరథోర్వరావరసతీత్రయమందుఁ జతుర్వరాకృతు

లుబ్ధమునఁ దాల్చి పుట్టిరి వ-మోఘము విష్ణుఁడ వీవు తావక।
ప్రదరనిపాతితంబులగు-రాక్షససైన్యములొక్కఁ ద్రెళ్లెడిన్ ॥ ౭౨॥

వ. అని యభినందించి మఱియుం బుణ్యకథా విశేషంబు లుపన్యసించుచు నిట్లుండ నగస్త్యుం డొక్కనాఁడు రఘుపుంగవుం గనుంగొని నీ వింక నిందుండవలువదు గౌతమీతటంబున నుత్కటంబగు పంచవటంబు గలదచట నుటజంబు నిర్మించికొని జానకీలక్ష్మణ సమేతుండవై యప్రమాదంబున నందునదియని చెప్పి రాఘవునకమోఘ శిలీముఖంబులొసంగి యాదరాతిశయంబున. ౭౩॥

క. హస్త్యయుతతయనివరుణుఁ గ।
భస్త్ర్యావయవుని రామ-భద్రునిఁ గరుణ।
న్నస్త్ర్యధికంబగు నటులన।
గస్త్యుఁడు దీవించెఁ గౌతు-కంబలరారన్ ॥ ౭౪॥

వ. దీవించినం బరమానందంబునొంది రామచంద్రుండు మునిచంద్రుం గనుంగొని. ౭౫॥

క. వింధ్యము వణఁచితి బలపరి।
సంధ్యభ్యర్థితుఁడవగుచుఁ-జాణితలమునం।
గంధ్యుదకమ్ముం ద్రావితి।
వంధ్యతపోవిభవపాగడ-వశమే నిన్నున్ ॥ ౭౬॥

వ అనియిట్లు ప్రత్యభినందనపూర్వకంబుగా వీడ్కొని, ౭౭॥

క. సాలసురసాలపనసత।
మాలవకుళపూగనక్త-మాలసదవిసీ।
శాలమగువనంబునసీ।
తాలక్ష్మణసహితుఁడై మో-దంబున నరిగెన్ ॥ ౭౮॥

గీ. ఇవ్విధంబున నరిగిమ-దేభసింహ।
శరభశార్దూలభల్లూక-సైరిభతతి।
గలిగి శాకఘూకార వా-క్రాంతమగుమ।
హావనంబుల విహరించు-నవసరమున ॥ ౭౯॥

సీ. పటుముఖతరుశిఖా-చ్ఛటలఁగనుంగొని,
యివిక్రూరసర్పంబు-లేయటంచు।
గుమ్ముఁబర్వ్యలువాఱు-క్రోడంబులనుగనుం,
గొనియివిగజములో-కోయటంచు।
వావిరిపొలఁగుశి-ఖావలంబులఁగని,
యివిపెనుభూతంబు-లేయటంచు।
వీచికాసదృశను-రీచికల్గనుఁగొని,
యివిదీర్ఘదీర్ఘిక-లేయటంచుఁ।
గీ. దరలవాత్రిక్షాదివల్లీవి-తానసంచ।
రల్లలితపింఛధమ్మిల్ల-భిల్లపల్లి।
వాధరులఁగాంచిమునికన్నె-లాయటంచు।
వడఁకువడఁకగడ్గవకుఁదన్నుఁ-బుడమిజాత॥ ౨౦॥
వ. వెండియు. ౨౧॥
చ. వికచసరోజగంధిపృథి-వీసుతరామునికేలువట్టికం।
టకతరుదుష్టసత్త్వనిక-టంబిచటంజరియింపనేలయొం।
డోకభయశూన్యమైనయెడ-కోయ్యనసేగుటయుక్తమంచుదా-।
రణధరపఙ్క్తిఁజూపుఁగడు-రమ్యములంచుదలంచిముగ్ధయై॥ ౨౨॥
వ. ఇట్లెఱుంగక పల్కుజానకిం గనుంగొని కోఁడోకవిషాదంబుగ దరిన న్మోగంబునందోపనీక మఱుమాటల నిట్లనియె. ౨౩॥
క. కాలవశతనివురించిన।
గాలవశతములను వేడ్కఁ-గనుఁగొను వైదే।
హీలతలువాలిచవైదే
హీలతితలకాంగిచూడు-మింపొందంగ॥ ౨౪॥

ఉత్సాహ.
కొమ్మకొమ్మటంచు నేర్చి-కొమ్మకొమ్మపందులుం।
గ్రుమ్మరించుపంచులమిం చు-కొండచఱులజొన్నలు।

న్నెమ్మియూలనెమ్మెగులుము-నెమ్మిప్రియులకున్నులు।
న్నమ్మికనోసంగు రాము-చంద్రుఁడువ్వంబునన్। ౬౫॥

వ. ఇట్లాసంగుచు వనవాసంబనాయాసంబగు నట్లుసేయుచున్న య
న్నంగనంగొని లక్ష్మణుండితనమనంబున॥ ౬౬॥

సీ. స్యందనంబుశతాంగ-మయ్యెభూజానికి,
జైవాతృకుఁబున్నాగ-మయ్యెఁబొన్న।
జగతీశునకుమట-జంబుభవనమయ్యెఁ,
నవనీపతికిజూర్ణ-మయ్యెరజము।
అధిపమౌళికిమావు-లశ్వరత్నములయ్యెఁ,
బంట్లయ్యెఁపృథుక-భల్లూకమ్ము।
లధిపతికిఛదంబు-లయ్యెఁబత్రంబులు,
దయలయ్యెనిగమము-ల్నరవరునకు।

గీ. భద్రకలశంబులయ్యెఁగుం-భములుప్రభున।
కఖిలజనమాన్యునకుగోత్ర-లయ్యెఁగపులు।
ధరణిబలవంతమైనవి-ధాతృకృత్య।
మెవ్విధంబునఁదలఁగుట-కెట్టివారు॥ ౬౭॥

క. మేలగువీణారవములు।
మేలుకనెడు రామవిభుఁడు-మృదువిగ్రహుఁడై।
కాల్ఁలమునసృగాలంబుల।
యూళలమేలుకనఁజొచ్చె-నుగ్రాటవులన్॥ ౬౮॥

వ. అనివగచి జానకింగనుంగొని॥ ౬౯॥

గీ. కఠినపాషాణకంటకా-క్రాంతమివ్వ।
కాంతమునసంచరింపఁగా-వకటయెట్టు।
లోర్చుమెత్తనిమెత్తల-నోర్వదరుణ।
కిసలయనిభంబుజనకజాం-ఘ్రిద్వయంబు॥ ౭౦॥

క. ధాత్రికిదితగునెకితము।
ధాతరువసుధాతలమున-దవిలిచరింప॥

మ. తపముల్సేసెడుసంయమీంద్రులకుశీ-తచ్ఛాయలంగూర్చెదా।
తపనుల్సంహరణంబొనర్చుఫలసం-తానంబులంగూర్చుఁదా।
దపముల్బూచితెధర్మమెల్లనువన-స్థంబయ్యెనిచ్చోఁబరం।
తపముఖ్యంబుగఁగొన్నివాసరములు దృఢలీలవర్తింతము॥ ౧౦౦॥

వ. అనిమఱియును. ౧౦౧॥

క. తమ్మునిఁగనుఁగొనివాచి।
త్తమ్మధిక ప్రమదసంయు-తమ్మయ్యెఁబవి।
త్రమ్ముగనొనరింపుముప।
త్రమ్ములతోఁ భవనమిచట-రమ్యముగాఁగన్॥ ౧౦౨॥

సీ. అనుటయునకుటీలుం-డాకుటిల్లొనరించి,
చూపినసెంతయుఁ-జోద్యమంది।
యమవితవిశాలంబు-నుజ్జ్వలత్పత్రల,
తాఁ ల్పితంబునా-తపముపార।
వర్షభయాపేత-భావంబుసమతలం,
బగుటకుమోదించి-యాదవమునఁ।
దమ్మునిగాఢరా-గమ్మునఁగౌఁగిట,
లాలించితకుశ-లతకుమెచ్చి।

గీ. సీతతోఁగూడనందువ-సించెఁదత్స।
మాపమునకొక్కచోటసౌ-మిత్రియుల్ల।
ముల్లసిల్లుచునుండఁ-గాఁపెటజంబుఁ।
గట్టికొనియుండెరామభూ-కాంతుఁడలర॥ ౧౦౩॥

వ. ఇవ్విధంబున నివసించి సమస్తోపచారంబులు లక్ష్మణుండొనరింప సుఖంబుండి సమయసమంబులు పండ్రెండుఁగదపియుల్పావశిష్టం బగు నత్త్రియోదశవత్సరంబునం దొక్కనాఁడు. ౧౦౪॥

మ. ధరణీనందనకున్ఫలంబులు సుమి-త్రానందనా తెమ్ముపో।
మ్మరయంబారఁగ రమ్మటంచుఁ బనుప-న్మోదంబునన్లక్ష్మణుం।
డురహింబూవులఁ గాయలాకులును బం-డ్లుంగోయనక్కాననాం।
తరసీమన్విహరించుచుండనతివి-స్తారాద్భుతాపాదియై॥ ౧౦౫॥

క. క్రతుభుగ్రిపునాళమును।
గ్రతరనితోద్వేలమొక్క-కరవాలమవ।
క్రతరంబైతోఁచెశత।
క్రతుమాయాకలితమగుచు-గగనతలమునన్। ౧౦౬॥

వ. అంతరిక్షంబునం బరతెంచి సమక్షంబున నిలిచిన యలక్షితకాక్షేయకంబు నభివీక్షించి లక్ష్మణుండు దక్షిణహస్తంబునం బరిగ్రహించి తత్తీక్ష్ణ పరిక్షారంబు గానప్పుడ॥ ౧౦౭॥

క. ధారాధరనిభములగుమ।
హీరుహములనలుకమూను-లేతెంచి ధరి।
త్రీరమణపుత్రిభవదసి।
ధారాదళితములు సేయఁ-దగు నేతరులన్॥ ౧౦౮॥

వ. అనిపలికి వారించి యమ్మునులా రాజనందను నుద్దేశించి॥ ౧౦౯॥

మ. ఫలసంఘుంబులు లేవురా వుఖగము-ల్పత్రంబులుం భక్షణా।
ర్హలసత్కాంతులుగావు కావునమహా-హ్యాళ్యాళికిన్ తావుబూ।
వులగుత్తుల్గవరావుమాత్రమునుఁదా-వుల్లేవురా కేంద్రనీ।
వులసద్బాహుబలుండవివ్వెదుసుఁ-బో్రివుందు నిత్యూటాడుమీ॥

చ. అనవుఁడు రాజనందనుఁడ-హర్పతి తేజుఁడు లక్ష్మణుండుచ।
య్యనఁదను హెచ్చరించెడుమ-హాత్ములకున్ముదమొప్పవంశవ।
రనమొనరించియందుదుధ-రప్రవిలిప్తకపోలునింగ్రహా।
ణనిహతసత్కపాలునిఖు-నప్రతశీలునిదైత్యబాలునిన్॥ ౧౧౧॥

క. కనిమునిపుత్రికుఁజంపితి।
వనిభయకంపితశరీరుఁ-డైకడు వేగం।

జనితకయన్నంగనుఁగొని।
విన్పించెందనదుసర్వ-వృత్తాంతంబుల్॥ ౧౧౨॥

వ. వెండియు. ౧౧౩॥

క. నరవరయెుఁగకగుల్మాం।
తరితుండైతపము సేయు-తాపసవంశో।
త్తమనోక బాలకుభయద।
క్షురికాహతుఁ జేసినాఁడ-సుమ్మని పలుకన్॥ ౧౧౪॥

ఉ. విన్మసహోదరాదనుజ-వీరులఁ జంపి మునీంద్రరక్ష సే।
యన్నమింతువచ్చెదురి-తాత్ములఁ జంపక నిట్లు సాధువృ।
త్తిన్మనయైసమాధినిర-తిన్మదమొందు మనుష్యమౌనిశా।
లున్మెడ దివ్వ నేసికడు-లోపితకర్ములమైతిమక్కటా॥ ౧౧౫॥

వ అని యనేకవిధంబుల ననుజసహితుండై విచారంబునొందుచున్న యన్నరేంద్రచంద్రుసమీపంబునకు మునీంద్రులరుగుదెంచి భవదనుజభుజాసిధారాదళితమస్తకుండగునతండు దనుజాంతు వీనిందునుమాడుటయనఘంబని యతనికి మనస్తాపోపశమనంబులగు వాక్యంబులుదగుభంగి నుపన్యసించి యనంతరంబ సౌమిత్రిం జేరొక్కని యుద్ధరాత్ముండు ఖద్యోజ్జిహ్వునకు రావణసహోదరియగు శూర్పణఖయందుద్భవించినవాఁడని తదీయజన్మప్రకారంబుఁ దేటపడంబలికి మఱియును. ౧౧౬॥

ఉ. జంబుకుమారుఁ జంపితివి-జంబుకుమారక దీనవీకుదో।
సంబుతలంచిచూడయాప-సంబుకులేదుముదంబునొందుమా।
త్రింబడనేలసీతనివ-ధించితినంచుఁ దదీయవృత్తిస।
ర్వంబుమునీశులుంగగళ్ళ వంబుగనిప్పుడువిన్నవింపమే॥ ౧౧౭॥

క. అనిమిషము సేయఁగఁడన।
జనకునిఁ జంపిన విరోధి-సమయింపఁగని।
ట్లొనరించెడుతపమితనిం।
దునుమాడిన దీనికు-దోసము గలదే॥ ౧౧౮॥

వ. అదియునుంగాక మదీయప్రేరితుండవై యొనరించుటం జేసి శా
పంబునకు సంశయింపంబనిగలదే యని వాచంయమిప్రకరంబు ని
జాశ్రమంబులకుం జనియె నిట్లు మహామునిప్రబోధితులై రామలక్ష్మ
ణులు నిర్విచారులై యుండి రంత నొక్కదినంబున॥ ౧౧౯॥

క. శూర్పణఖవచ్చియటుపరి।
మార్పఁబడినకొడుకుఁ జూచి యారనివగతో।
న్నేర్పఁగనగ్గహనమద్రువ।
నార్పులుబొబ్బలుసెలంగ-నాక్రందించెన్॥ ౧౨౦॥

వ. ఇట్లరణ్యరోదనంబు సేయుచు మ్రాతుండగు సుతుందలంచి।

శా. తండ్రిం జంపినవానిఁ జంపుటకును-ద్యన్నిష్ఠనిచ్చోఁగడు।
న్రౌంద్రంబైన తపంబు సేయు నిను నే వీఁకం దుహింసించెనో।
తండ్రీ నామదశోకమారు నెమహా దౌష్ట్యంబు సంధిల్లఁబే।
కంద్రం జంపకవంచు నుద్వృత వక్త్రాంబోల్లసద్దంష్ట్రియై॥ ౧౨౨॥

ఉ. మానుఁగాంచినాసుతున-మానుషతేజు వధించినట్టిదు।
ర్మానినిజాపకున్నమిము-రమ్మందఁగ మోఁదెదనన్న వారల।
మ్మానినిఁగాంచి భీతియుత-మానసులైతగ నిట్లువల్కిరి।
మ్మానిజయూలకించుమొక-మర్త్యవరేణ్యుఁడుగ్రుం చెనావుడున్॥

ఉ. అంగనవానిఁ బట్టిపరి-మార్పఁదలంచికడంగి ఘోరతా।
లాంగనవో లెగ్గోయుచుమ-హాటవినొక్కెడఁ గాంచెసాధ్వినా।
త్మాంగనఁగూడిసోదరస-హాయమునందగు నీతిఁ బర్ణశా।
లాంగన మొప్పఁజేయుమహి-తాత్ము రాముని కీర్తికాముని౯॥ ౧౨౪॥

వ. ఇట్లుగాంచి, ౧౨౫॥

ఉ. వామకరోల్లసద్ధశన-వారవిభాచపలాంశుజాలము౯।
శ్యామలవర్ణముం బటుద-యారసవృష్టియుఁ గల్గికానలో।
నీతెయిమున్న వాఁడుఘనుఁ-డీతఁడు సంశయమింత లేదు నా।
కీమహసీయతేజ నెడ-నెంతయు నగ్గలమయ్యెఁ గామము౯॥ ౧౨౬॥

వ. అనిమతిజాము నతనిం దనివి సనకకనుంగొని. ౧౨౭।

సీ. ఇతనిమోమరవింద-మితనికన్నులయంద,
మిందీవరంబుల-పొందుఁదెగడు।
నితనికటులులితెన్నె-లితనిమాటలచిన్నె,
లలసుధాధారావ-యంబుఁదెగడు।
నితనిపొక్కిలిబావి-యితనిచెక్కులఠీవి,
యలదర్పణములసో-యగముఁదెగడు।
నితనిమోవిపగడం-బితనికంఠముడంబు,
కంబుమానితసుంద-రంబుఁదెగడు।

గీ. నితనిహస్తములస్తము-లితనివెడఁద।
యురమయురమిమ్మహాత్ముపొం-దొప్పఁగాంచి।
యొలమినొందనిజన్మంబు-వ్యర్థయటంచుఁ।
జేరఁజనుదెంచె రాక్షస-స్త్రీరయమున॥ ౧౨౮॥

క. మునివర్యులకున్మోహము।
జనియింపఁగఁజేయు రామ-చంద్రుంగని తా।
మినిదోషాచరి మోహిం।
చినదనుటకు ధరణి సేమి-చిత్రము తలఁపఁగ॥ ౧౨౯॥

క. కనిరివవంశ్యులు జేరం।
జనుదెంచెడు దానిఁగుసుమ-సాయకబాణ।
ప్రనిహతమనోబ్జజనఖం।
దనపటుతరతీక్ష్ణశూర్ప-ణఖశూర్పణఖన్॥ ౧౩౦॥

అయ్యవసరంబున లక్ష్మణుఁడు నీవెవ్వరి దానవిన్నవలనికి రాఁబ్రయోజనంబు నీకుంగలుగ దేమి దశరథ రాజనందనుల మివ్వనంబునకు విహారార్థంబు చను దెంచితి మెడగలిగి పొమ్మనుఁడు నతని నాదరింప కయన్నిశాచరి రామచంద్రుంగనుంగొని॥ ౧౩౧॥

ఉ. ఆతతకీర్తిపూర్వవిబు-ధాధిపశేఖరుఁడైన రావణా।
ఖ్యాతునితోఁడఁబుట్టువన-శంషి... బులస్త్యవంశసం।

జాతసు నిన్నుఁ గాంచి సుమ-సాయకసాయకపీడితాంగనై
తీరను వేలరాదు వసు-ధేశ్వర నన్ను వరింపకుండినన్॥ ౧౩౨॥

వ. అదియునుంగాక వినుము నేను కామరూప ననేకవిధ సుందరాకారంబులు వహించి ప్రీతుం జేయను దలఁచినచోటికి నిన్నెత్తికొని పోవ నేర్తు మదీయ నామధేయంబు శూర్పణఖ యన్నుం గలసి భవద్భ్రాతృయానుజ ప్రియాసహాయం బపేక్షింపక కామోపభోగంబులను భవింపుమని పల్కి-నవ్వుచు నతం డారక్కసిం గనుంగొని॥ ౧౩౩॥

క. కుమతీ చంపక విడిచినఁ।
భ్రమదంబునఁ బొంగి చవక-ప్రత్యుక్తులఁ గూ।
టముఁ గోరెదు బాతోరా।
కుముటన్నం జంకె నెత్తి-కొనుము నభంగిన్॥ ౧౩౪॥

క. అనిపలుకునంత దానిం।
గనితద్వాక్కృతాకృతియును-ఖరనిస్వనముం।
దనకద్భుతమగుదుధరా।
తినయువగిరొనగివఁ గ్రోధ-తామ్రీనయనై॥ ౧౩౫॥

ఉ. ఆదనుజాంగ నాధమధ-రాత్మజఁ గన్గొనినిన్ను భ్రమింగివం।
గాదను వారు లేరునను-గర్వముఁ దక్కు మటంచు దానిహృ।
ద్భేదనవాక్యసంతతులు-పేర్చిలిన రాముఁడు కర్ణనాశికా।
చ్ఛేదనమాచరింపుమనఁ-జెచ్చెరలక్ష్మణుఁ డట్లొనర్చెన్॥ ౧౩౬॥

క. చుక్కఁ జెవులుఁ దెగిపోవుడు।
ముక్కు జెరక్కసులు వెగడ-భూరరవమున నా।
టక్కరిమిక్కిలి యేడ్చుచు।
నక్కరణి స్వయధర్మ-కేమీకను మన్॥ ౧౩౭॥

ఉ. కాలమువ్రేక్కనంగినియు-వాయుభుగంగనభంగినింగివా।
తూలరయంబునంబఱచి-దుర్మతియప్పిశితాశియున్న చే।
కోలగమున్న చోటయధి-కోద్గమవైకృతకర్ణనాశికా।
మూలము లెంతయున్సలుప-ముందఱ వ్రాలెఁ గరంబుదీనతన్॥

